ప్రత్యేకవిజ్ఞాన శాస్త్రమూ చాలదు. సాంఘికశాస్త్రాలు, ప్రకృతి శాస్త్రాలు అవలోడించి, అవిప్రతిపాదిస్తున్న అర్థాలను సమన్వయించి ప్రకృతి జీవితాలను వివరించే సమగ్రసిద్ధాంతం ఏర్పరచాలి. ఈపని తత్త్వశాస్త్రం చేస్తుంది.

"సత్తానంతయు (Existence) వివరించటం తత్త్వశాస్త్రంవిధి. సత్తావివరణకు సత్తాజ్ఞానం కావాలి. సత్తా భిన్నభిన్నదశలకు సంబంధించిన జ్ఞానం వివిధ విజ్ఞానశాస్త్రాలవల్ల లభిస్తుంది. తత్త్వశాస్త్రం వివిధశాస్త్రాలు ప్రతిపాదించే అర్థాలను అన్నిటినీ సమన్వయించి ప్రకృతి జీవితాలను వివరిస్తూ ఒక సమగ్రసిద్ధాంతం తయారుచేస్తుంది. విజ్ఞానశాస్త్రం వున్నదివున్నట్టు వర్ణిస్తే, తత్త్వశాస్త్రం వున్నదానిని వివరిస్తుంది. అందువల్ల తత్త్వశాస్త్రం శాస్త్రానికి శాస్త్రం అవుతున్నది."

ఇలాంటి తత్త్వశాస్త్రంవల్లనే కళాస్వరూపం నిర్ణయించుకోటానికి వీలవుతుంది. అయితే యిలా చెప్పటంవల్ల కొంత ఆశ్చర్యం కలగవచ్చును. "కళవేరు—శాస్త్రంవేరు. రచయిత సంవేదనం తెలియజేసే కళకూ, సామాజికునకూ చక్షుష్కర్ణం ద్వారా సద్యఃపరనిర్వృతి కలిగించేకళకూ, అతీంద్రియ అతిలోకార్థాలను వివరించే తత్త్వశాస్త్రానికి సంబంధ మేమిటి?" అన్న శంక కలుగవచ్చును. ఈ సందర్భంలో ఏ శాస్త్రానికైనా ప్రత్యక్షానుమానాలు అనుల్లంఘనీయ ప్రమాణాలని జ్ఞప్తికితెచ్చి ఒకవిషయం చెబుతాను. జీవితానికీ, తత్త్వశాస్త్రానికీ వున్న సంబంధమే కళకూ అలంకారశాస్త్రానికి వున్నది. జీవితవిశేషమే కళఅయినట్టుగా తత్త్వశాస్త్రవిశేషమేఅలంకారశాస్త్రం. తత్త్వశాస్త్రం జీవతత్త్వాన్ని అర్థంచేసుకొంటూ, తరువాత కొన్నివందల యేండ్ల వరకూ వచ్చిన జీవితాన్ని ముందుగా సూచించగలిగినట్లుగానే, ఉత్తరోత్తరవచ్చే కావ్యస్వరూపాలను కొన్నివందల యేండ్లకు

ముందుగానే అలంకారశాస్త్రం సూచించటానికి వీలున్నది. ౧౯ శతాబ్ది పూర్వార్ధంవరకు ప్రకృతిశాస్త్రాలకు అధారభూతంగా వున్న పరమాణువాదాన్ని క్రీస్తుపూర్వమే డెమోక్రటోస్, కణాదుడు ప్రతిపాదించారు. ఈనాడు సాపేక్షవాదం (Theory of Relativity), పదార్థవిజ్ఞానశాస్త్రం కనుగొన్న దేశకాలద్రవ్యాల స్వరూపం,ఆశ్రయస్వరూపం కార్యకారణభావతత్త్వంసాంఖ్యదర్శనం కీస్తుపూర్వమే సూచించింది. పరిణామవాదాన్ని హెగిలియన్ దర్శనం ముందుగానే యథాతథంగా కాకపోయినా స్థూలంగానైనా ఊహించగలిగింది. అలాగే అలంకారశాస్త్రంకూడ. కొన్ని కావ్య స్వరూపాలను, ముఖ్యంగా నేటి యేకాంకిక, కథానిక, శ్రవ్య నాటిక, నాయకులులేని నాటకాలు, ఇతివృత్తాలులేని కావ్యాలు, రససాంకర్యంలోని వైచిత్రి ముందుగానే ఊహించగలిగింది.

ఇంతవరకూ పరిశీలించిన విషయాలనుబట్టిచూస్తే, అలంకారశాస్త్రం కళాస్వరూపాన్ని, వివిధసృష్టుల అర్థాలను, విశిష్టతావిశిష్టతలను, ప్రకృతి సామాజికశాస్త్రాలతో దాని కున్న సంబంధాన్ని వివరిస్తుందని యీ రచయిత భావిస్తున్నాడని గోచరించక మానదు. అలాంటి శక్తే దీనికి ఉన్న పక్షంలో అలంకారశాస్త్ర చరిత్రను వ్రాస్తూ బొశాంకో కవుల, కళాకారుల సృష్టుల బాగోగులను ఈ శాస్త్రం విమర్శించదనీ, కేవలం రామణీయకం అంటే, ఏమిటో, దానికి జగత్తులో ఉన్న స్థానమేమిటో వివరిస్తుంది; తత్త్వశాస్త్రానికి జగత్తత్త్వం మాత్రమే వివరించటం ముఖ్యమై ప్రవృత్త్యాదులతో సంబంధం లేనట్లే, అలంకార శాస్త్రానికి రామణీయక తత్వపరిశీలనం ముఖ్యమై అనుశాసనం అముఖ్యమన్నాడు. అతడు అలా ఎందుకన్నాడని సందేహం కలగక మానదు. బొశాంకో లిబరలిజం స్కూలువాడు. అందువల్ల ఆశాస్త్ర దృష్టితో అలా వ్రాశాడు. నిజానికి మానవచరిత్రలో బయలుదేరిన

ముందుగానే అలంకారశాస్త్రం సూచించటానికి వీలున్నది. ౧౯ శతాబ్ది పూర్వార్ధంవరకు ప్రకృతిశాస్త్రాలకు అధారభూతంగా వున్న పరమాణువాదాన్ని క్రీస్తుపూర్వమే డెమోక్రటోస్, కణాదుడు ప్రతిపాదించారు. ఈనాడు సాపేక్షవాదం (Theory of Relativity), పదార్థవిజ్ఞానశాస్త్రం కనుగొన్న దేశకాలద్రవ్యాల స్వరూపం,అశ్రయస్వరూపం కార్యకారణభావతత్త్వంసాంఖ్యదర్శనం కీస్తుపూర్వమే సూచించింది. పరిణామవాదాన్ని హెగిలియన్ దర్శనం ముందుగానే యథాతథంగా కాకపోయినా స్థూలంగానైనా ఊహించగలిగింది. అలాగే అలంకారశాస్త్రంకూడ. కొన్ని కావ్యస్వరూపాలను, ముఖ్యంగా నేటి యేకాంకిక, కథానిక, శ్రవ్యనాటిక, నాయకులులేని నాటకాలు, ఇతివృత్తాలులేని కావ్యాలు, రససాంకర్యంలోని వైచిత్రి ముందుగానే ఊహించగలిగింది.

ఇంతవరకూ పరిశీలించిన విషయాలనుబట్టిచూస్తే, అలంకారశాస్త్రం కళాస్వరూపాన్ని, వివిధసృష్టుల అర్థాలను, విశిష్టతావిశిష్టతలను, ప్రకృతి సామాజికశాస్త్రాలతో దాని కున్న సంబంధాన్ని వివరిస్తుందని యీ రచయిత భావిస్తున్నాడని గోచరించకమానదు. అలాంటి శక్తే దీనికి ఉన్న పక్షంలో అలంకారశాస్త్ర చరిత్రను వ్రాస్తూ బొశాంకో కవుల, కళాకారుల సృష్టుల బాగోగులను ఈ శాస్త్రం విమర్శించదనీ, కేవలం రామణీయకం అంటే, ఏమిటో, దానికి జగత్తులో ఉన్న స్థానమేమిటో వివరిస్తుంది; తత్త్వశాస్త్రానికి జగత్తత్త్వం మాత్రమే వివరించటం ముఖ్యమై ప్రవృత్త్యాదులతో సంబంధం లేనట్లే, అలంకార శాస్త్రానికి రామణీయక తత్త్వపరిశీలనం ముఖ్యమై అనుశాసనం అముఖ్యమన్నాడు. అతడు అలా ఎందుకన్నాడని సందేహం కలగకమానదు. బొశాంకో లిబరలిజం స్కూలువాడు. అందువల్ల ఆశాస్త్ర దృష్టితో అలా వ్రాశాడు. నిజానికి మానవచరిత్రలో బయలుదేరిన

ప్రత్యేకవిజ్ఞాన శాస్త్రమూ చాలదు. సాంఘికశాస్త్రాలు, ప్రకృతి శాస్త్రాలు అవలోడించి, అవిప్రతిపాదిస్తున్న అర్థాలను సమన్వయించి ప్రకృతి జీవితాలను వివరించే సమగ్రసిద్ధాంతం ఏర్పరచాలి. ఈపని తత్త్వశాస్త్రం చేస్తుంది.

"సత్తానంతయు (Existence) వివరించటం తత్త్వశాస్త్రంవిధి. సత్తావివరణకు సత్తాజ్ఞానం కావాలి. సత్తా భిన్నభిన్నదశలకు సంబంధించిన జ్ఞానం వివిధ విజ్ఞానశాస్త్రాలవల్ల లభిస్తుంది. తత్త్వశాస్త్రం వివిధశాస్త్రాలు ప్రతిపాదించే అర్థాలను అన్నిటినీ సమన్వయించి ప్రకృతి జీవితాలను వివరిస్తూ ఒక సమగ్రసిద్ధాంతం తయారుచేస్తుంది. విజ్ఞానశాస్త్రం వున్నదివున్నట్టు వర్ణిస్తే, తత్త్వశాస్త్రం వున్నదానిని వివరిస్తుంది. అందువల్ల తత్త్వశాస్త్రం శాస్త్రానికి శాస్త్రం అవుతున్నది."

ఇలాంటి తత్త్వశాస్త్రంవల్లనే కళాస్వరూపం నిర్ణయించుకోటానికి వీలవుతుంది. అయితే యిలా చెప్పటంవల్ల కొంత ఆశ్చర్యం కలగవచ్చును. "కళవేరు—శాస్త్రంవేరు. రచయిత సంవేదనం తెలియజేసే కళకూ, సామాజికునకూ చమత్కారం ద్వారా సద్యఃపరనిర్వృతి కలిగించేకళకూ, అతీంద్రియ అతిలోకార్థాలను వివరించే తత్త్వశాస్త్రానికి సంబంధ మేమిటి?" అన్న శంక కలుగవచ్చును. ఈ సందర్భంలో ఏ శాస్త్రానికైనా ప్రత్యక్షానుమానాలు అనుల్లంఘనీయ ప్రమాణాలని జ్ఞప్తికితెచ్చి ఒకవిషయం చెబుతాను. జీవితానికి, తత్త్వశాస్త్రానికి వున్న సంబంధమే కళకూ అలంకారశాస్త్రానికీ వున్నది. జీవితవిశేషమే కళఅయినట్టుగా తత్త్వశాస్త్రవిశేషమే అలంకారశాస్త్రం. తత్త్వశాస్త్రం జీవతత్త్వాన్ని అర్థంచేసుకొంటూ, తరువాత కొన్నివందల యేండ్ల వరకూ వచ్చిన జీవితాన్ని ముందుగా సూచించగలిగినట్లుగానే, ఉత్తరోత్తరవచ్చే కావ్యస్వరూపాలను కొన్నివందల యేండ్లకు

ప్రబలతత్త్వాలు, శాస్త్రాలు ఏవి తమ తరువాత వచ్చిన జీవితాల్ని మార్చి దిద్ది తీర్చలేదు? ప్లేటో అరిస్టోటల్ ప్రతిపాదించిన అర్థాలే అంకురించి ఎదిగి క్రైస్తవమత సిద్ధాంతాలుగా పుష్పించాయి. బౌద్ధతత్త్వబోధి వృక్షఫలాలే అశోకహర్మ్యాలు, అజంతాచిత్రాలు. హెగిల్‌తత్త్వ ఉల్బణాలే అటు కమ్యూనిజం, ఇటు ఫాసిజం. ఇంతకన్నా విశదంగా తత్త్వశాస్త్రం ఎలా జీవితాన్ని మార్చి దిద్ది తీర్చిందో చూపించవచ్చును. కాని ఆ విషయం మనకు ముఖ్యం కాదు. జగత్తు ఎలా ఉన్నదో మాత్రమే తత్త్వశాస్త్రం వివరిస్తుంది. కాని, నిత్యజీవితమందలి కార్యకలాపాలతో దాని కెలాంటి సంబంధము లేదన్న లిబరల్ పక్షంవారి శాస్త్రార్థాలుకూడ జీవితాన్ని మార్చివేశాయి. యూరప్‌లో నేడు ఆర్థిక, రాజకీయ, సాంఘిక, ధార్మిక, కళావిషయకరంగాలలో ఏర్పడిన తీవ్రవిషమ స్థితికి దారి తీసింది. ఫాసిజం కమ్యూనిజం బయలుదేరి ప్రబలమైనది ఈ లిబరలిజంవల్లనే. ఈనాడు అనుక్షణము యుద్ధ ప్రమాదం ఏర్పడటానికికూడా ఈ లిబరలిజమే కారణమని మేధావులు భావిస్తున్నారు. ♦

ఇంతకూ చెప్పవలసిన విషయం—బాహిరిల్లిన భావంకాని, తత్త్వంకాని ముభావంగా ఉండదు. బాహిరిల్లినాడే దానికి రెక్కలు బయలుదేరుతాయి. రెక్కలు వచ్చినప్పుడు ఏదీ ఊరుకోదు. అందువల్ల బౌశాంకోవాక్యం ప్రమాణంగా తీసుకో నవసరం లేదు.

సరే; అలంకారశాస్త్రం, "కళాస్వరూపం ఇది, సాహిత్యం ఇలా ఉంటుంది, సంగీతం ఇలా ఉంటుంది, చిత్రలేఖనం ఇలా ఉంటుంది, ధర్మశాస్త్రానికీ కళకూ, జీవితానికీ కళకూ ఈసంబంధాలు ఉన్నాయి," అని తెలుపుతుందే అనుకొందాము. ఇదంతా అనుశాసనమేకదా. ఈ అనుశాసనం స్వాతంత్ర్య విచ్ఛేదకమే.

♦ కారల్ మాన్‌హీమ్ వ్రాసిన Man and Society, Diagnosis of our Time చదివితే కొంతవరకు ఈవిషయం బోధపడుతుంది.

కదా? కాబట్టి అలంకారశాస్త్రం ముఖ్యమంటున్నారంటే కళా కారుల స్వాతంత్ర్యం అంగీకరించటం లేదని స్పష్టం కావటం లేదా? అంటే మానవుడు ఏ భగవదాజ్ఞనో, కర్మఫలాన్నో శిరసా వహించటానికో, లేక అనుభవించటానికో భూలోకంలో అవత రిస్తున్నట్లు భావించటం కాదా?

ఇలాంటిప్రశ్న సహజమే. అయితే యిలాంటి ప్రశ్న వేసే వారికున్న స్వాతంత్ర్యభావం విచిత్రం, విపరీతం. ఇది వ్యతిరేకి లక్షణమే కాని, అన్వయిలక్షణం కాదు. కేవల ప్రతిబంధక రాహిత్యం, వీతవిఘ్నత, ఆవరణభంగము స్వాతంత్ర్యం కాజాలదు. నిజంగా ప్రతిబంధకరాహిత్యమే స్వాతంత్ర్యమయిన పక్షంలో నేటి సామాజికునికంటే ఆటవికుడు, అతనికంటె పశు పక్ష్యాదులు, వానికంటె జడప్రపంచం స్వతంత్రం కావాలి. అది అలా ఉంచి కేవల వీతవిఘ్నత జగత్తుకే లేదు. గ్రహకోటికి, చేతనాచేతనకోటికి నియత సంబంధమున్నది. పూర్వపూర్వదశ లచే ఉత్తరోత్తరదశలు అవచ్ఛిన్నము లవుతున్నవి. అందువల్ల కేవల ప్రతిబంధక అభావం జగత్తుకేలేదు. అలాంటి స్వాతంత్ర్యం జగత్తుకే లేనప్పుడు జగత్తులో అంశభూతుడైన మానవునకు ఎలా లభిస్తుంది?

## స్వాతంత్ర్యం

స్వాతంత్ర్యమంటే అవివేకం కాదు; వివేకము. హేతు మత్త్వము, స్వయమవచ్ఛిన్నత దానికి లక్షణాలు. కవి కావ్యాన్ని వ్రాస్తున్నప్పుడు తానొక అనుభవం వ్యక్తం చేస్తున్నా నన్న జ్ఞానం యత్కించిత్తైనా వుండాలి. అలాంటి స్ఫురణమైనా లేనప్పుడు అరిషడ్వర్గానికి వివశుడైనవానివలె అస్వతంత్రు డవుతున్నాడు కాని స్వతంత్రుడవటంలేదు. అది స్వాతంత్ర్యమే అయిన పక్షంలో

వాసనాప్రేరితమై కూసే పరభృతంకూడా స్వాతంత్ర్య మనుభ విస్తున్నదని చెప్పాలి.

వివేకమే స్వాతంత్ర్యం. అంటే స్థితిగతుల గ్రహణం వుండాలి. ఏ స్థితిగతులవల్ల ప్రకృత స్థితిగతులు వచ్చినవో, ఎలాంటివాటివల్ల వీటిని మార్చుకోటానికి కాని, నిలబెట్టుకోటానికి గాని వీలున్నదో గ్రహించాలి. అలాంటి జ్ఞానం ప్రవృత్తికి దారి తీయక తప్పదు. ఎందుకంటే జ్ఞానం కొందరు భావిస్తున్నట్లు నిష్క్రియం కాదు. ఎఱుక అనేది ఎఱుగుట అనే క్రియవల్ల ఏర్పడుతున్నది. అందువల్ల జ్ఞానం క్రియాగర్భితం. క్రియలవల్ల జ్ఞానం, జ్ఞానంవల్ల క్రియ పుష్టము లౌతాయి. ఇలాంటి స్థితితత్త్వగ్రహణ శీలమైన జ్ఞానమే స్వాతంత్ర్యం కాని వున్న స్థితిగతులు సుఖదాయకంగా వున్నాయనో, లేక దుఃఖదాయకంగా వున్నాయనో, అస్ఫుటభావం కలిగితే అది స్వాతంత్ర్యం పొందటం కాదు. ఇప్పటి సామాజిక స్థితిగతులు బాగున్నాయని కొంద రనుకొంటున్నారు. బాగుండలేదని కొందరు భావిస్తున్నారు. ఇలాంటి అస్పష్టసంవేదనం స్వాతంత్ర్యం కాదు. ఇప్పటి స్థితిగతులు ఈ యీ హేతువులవల్ల సమంజసాలు, ఆవశ్యకాలు అని గ్రహించి వాటి రక్షణకు కృషిచేయటం స్వాతంత్ర్యం; కాక ఈ యీ హేతువులవల్ల ఇప్పటి స్థితిగతులు అసమంజసాలు, అనావశ్యకాలు అని గ్రహించి వాటిని తొలగించి ఇంతకంటె మంచి స్థితిగతులను నెలకొల్పుకొనటానికి పాటుపడటమే స్వాతంత్ర్యం. అయితే వివేకం అనేకహేతువులవల్ల తరతమ భావాలు కలిగినదే అయినా యీ తారతమ్యాలకు స్పర్ధలేదు. ప్రబలతమమైనదానిలో ప్రబలతరమైనది నదిలో నదంపలె, దావానలంలో విస్ఫులింగంలాగా లీనమైపోతుంది.

ఈ అర్థంలోనే వివేకానికి అంటూ సొంటూ, జాతి కులము, దేశము కాలము, నేను నీవు అన్న పరిచ్ఛేదంలేదు. వివేకానికి

ఇలాంటి లక్షణం ప్రత్యక్షంగాకాని, పరోక్షంగాకాని తత్త్వవేత్తలు, శాస్త్రకారులు, కళాకారులు అంతా అంగీకరించారు. అంగీకరించని పక్షంలో శాస్త్రాలకూ, కళలకూ తావులేకపోవలసింది. అంతేకాదు. ఇలాంటి లక్షణమే వివేకానికి లేకపోతే సమాజం ఏర్పడటానికి, ఏర్పడినది విచ్ఛిన్నంకాక రక్షితంకావటానికి వీలు లేదు. అనుక్షణం యుధ్యమాను లవుతూ మానవులు పశువులై, ఆ పశువులు జడాలై, ఆ జడాలు నష్టధర్మాలై ఈ జగత్తు ఈ అనంతప్రపంచం లేకపోవాలి.

అందువల్ల వివేకం వున్నది. వున్నదానికి దేశకాలాలు అనేవి వృత్తులు, ధర్మాలు. ఇది అంగీకరించకపోతే సదసత్తులకు భేదంలేదు. అందువల్ల వివేకానికి శరీరం వుంటున్నది. వునికికి మార్పు లక్షణం. మార్పు యథార్థం కాదన్నపక్షంలో ఆభాసను అంగీకరించవలసివస్తుంది. దానివల్ల భారతీయదార్శనికులవలె సంసారానికి అనాదిత్వము, తద్ద్వారా సదసత్తుల ద్వైతము ఒప్పుకోవలసివస్తుంది. అందువల్ల మారునది, పరిణామి (Becoming) యథార్థం.

పరిణామియథార్థము, ఏకైకము. అందువలన ఈ పరిణామి తన పరిణామానికి తానే హేతువవుతున్నది. అంటే పూర్వదశనుంచి వుత్తరదశ, ఆ వుత్తరదశనుంచి తదుత్తరదశగా నిట్లనంతక్రాంతి పొందుతున్నది. అంటే స్వయమవచ్ఛిన్నమౌతున్నది. ఈ స్వయమవచ్ఛిన్నతయే వివేకము, స్వాతంత్ర్యము, ధర్మము.

స్వయమవచ్ఛిన్నతను అంగీకరించని పక్షంలో భిన్నభిన్న దశలకు ఎలాంటి సంబంధంలేదనీ, ఆ దశాస్థితికి తదన్యము హేతువుగా మరొక పదార్థాన్ని అంగీకరించవలసి వస్తుంది.

ఆపక్షంలో తిరిగి ద్వైతభావం ఏర్పడుతుంది. ద్వైతము వివేకానికే కుఠారపాతం; అవివేకానికి అంకురారోపణం.

ఇంతకూ స్వాతంత్ర్యమంటే కేవల ప్రతిబంధక అభావం కాదు. వున్న స్థితిగతులను తనకు తానుగా నిలబెట్టుకోటానికి కాని, తొలగించుకోటానికిగాని అవకాశం వుండటమే. ఇది హేతువును పురస్కరించుకొని జరగాలి. అంతేకాని ఈస్థితి సుఖకరంగా వున్నది కాబట్టి వుండాలనుకోవటం, లేక దుఃఖకరంగా వున్నది కాబట్టి పోవాలనుకోవటం మాత్రమే స్వాతంత్రం కాదు. ఈసుఖదుఃఖాత్మక సంవేదనం స్వాతంత్ర్యనగర ప్రాంచలానికి మాత్రమే కొనిపోతుంది. ఇది యీ యీ హేతువులవల్ల సమంజసమో, లేక అసమంజసమో నిర్ణయించుకొని రక్షితవ్యమైతే, ఈ యీ పద్ధతులను అవలంబించి మార్చుకోవాలని యెరిగి తదనుగుణంగా ప్రవర్తించటం స్వాతంత్ర్యం. అందువల్ల స్వాతంత్రానికి వివేకం పునాది అవుతున్నది. వివేకంలో తారతమ్యాలున్నాయి.

అందువల్ల వివేకతమమైనదేకాని మిగిలినవి స్వాతంత్ర్యం కాదు. అందుచే ప్రతిదశలోను స్వాతంత్ర్యం అనేది ఒకటే కాని పెక్కులు కావు.

వుదాహరణ వుంటే పైవిషయాలు ఇంకా స్పష్టంగా గ్రహించటానికి వీలవుతుంది. కవిస్వాతంత్రమే తీసుకుందాము. ఆతడు స్వాతంత్ర్యం అనుభవిస్తున్నాడా, లేదా అన్న ప్రశ్నకు ముందు రెండు ప్రశ్నలకు సమాధానం చెప్పుకోవాలి. (౧) అతడు ఆవేశవివశుడై వ్రాస్తున్నాడా? లేక అనుభవం అభివ్యక్తం చేస్తున్నానన్న స్ఫురణ వుంటున్నదా? ఆ అనుభవ అభివ్యక్తి మాత్రమే ప్రధానమవుతున్నదా, లేక ఆ అభివ్యక్తి మరొకదానికి అంగముకాని, సాధనముకాని అవుతున్నదా? (౨) అతని

కావ్యంలోని అర్థములు అన్యోన్యాశ్రితాలై స్వయంగా అవచ్ఛిన్న మౌతున్నవా? లేక బాహ్యార్థములవల్ల అవచ్ఛిన్నము లవుతున్నవా? అనుభవం అభివ్యక్తం చేస్తున్నానన్న స్ఫురణం కవికి వుండి అతడు తన కావ్యార్థాలను తదనుభవైక అవచ్ఛిన్నాలను చేస్తే ఆతడు స్వతంత్రు డవుతున్నాడు. లేనిపక్షంలో అస్వతంత్రు డవుతున్నాడు.

ఇలా స్వాతంత్ర్యమంటే వివేకము, స్వయమవచ్ఛిన్నత అవుతున్నదేకాని అవివేకము, విశృంఖల వృత్తికావటంలేదు. శాస్త్రం వివేకానికి తోడ్పడుతూ స్వయమవచ్ఛిన్నతా సూత్రాలను పేర్కొని స్వాతంత్ర్యవికాసానికి సూర్యోదయమవుతున్నదే కాని అడ్డుతగలటం లేదు. అంతేకాదు. స్వాతంత్ర్యసిద్ధికి మొదటి మెట్టు శాస్త్రం, రెండోమెట్టు ప్రవృత్తి.

ఈ విధంగా శాస్త్రం ఆవశ్యకత సిద్ధిస్తున్నది. లోగడ శాస్త్రం ఏమి చేస్తుందో, దాని లక్ష్య మేమిటో చెప్పుకొన్నాము. దానికి రెండంశాలున్నాయి: (౧) అనుభవం, (౨) వున్న అనుభవాల సమన్వయీకరణం. శాస్త్రనిర్మితికి ఈరెండూ ముఖ్యం. ఇలాంటి శాస్త్రం ఎవనికి వాడుగా, పూర్వంతో సంబంధం లేకుండ నిర్మించటం అసంభవం. వెనుకటి శాస్త్రకారుల అనుభవాలను, సమన్వయీకరణమార్గాలను పరిశీలించి తనకున్న అనుభవాలతో జోడించి స్వతంత్రంగా ఆలోచించిననాడు సమగ్రశాస్త్రం ఊహించుకోటానికి వీలవుతుంది. అంతకన్న సుగమమైన మార్గం మరొకటిలేదు.

కాబట్టి నేడు కళారంగంలోని అవ్యవస్థ పోవాలన్న సమగ్రమైన అలంకారశాస్త్రంకంటె మరొక తరణోపాయంలేదు. అలాంటి శాస్త్రజ్ఞానం ఉంటే వ్యాప్తిమార్గాలు ఆలోచించవచ్చును. కాని అలాంటి జ్ఞానం కొరతగా వుంది. అందువల్ల అలంకార

శాస్త్ర నిర్మితికిముందు అత్యంతప్రధానమైన ప్రాక్ప్రతీచీ పూర్వక అర్వాచీన ఆలంకారిక మతాలను తెలుగులముందు పెట్టటం అవసరం. ఆపని జరిగిననాడు సమగ్రమైన అలంకారశాస్త్రం ప్రతిభావంతులు నిర్మించటానికి వీలవుతుంది. అప్పుడే కళా రంగంలో వున్న అవ్యవస్థ పోతుంది.

## 2 కళ

కంటికో చెవికో గోచరించనది కృతి (Work of Art) కాదు. అంతమాత్రంచేతనే యీ రెండింద్రియాలకు గోచరించే వన్నీ కృతులని భావించ నవసరంలేదు. విశిష్టశబ్ద రూపాత్మకముతైన విషయాలుకృతులు. విశిష్టం అంటే ఏమిటో తరువాతచూదాము. ఈ విశిష్టశబ్ద రూపాత్మక విషయాలు కళ అంటున్నామంటే సూర్యోదయం, రత్నం, ఆలయం, విగ్రహం, చిత్రం, గీతం, కావ్యం ఇవన్నీ కళక్రిందికే వస్తాయి. ఇవన్నీకృతులే. మామూలుగా ఈ నిర్వచనానికి ఎలాంటిబాధ కనిపించక పోవచ్చును. కాని దీనికికూడా ఆక్షేపణలున్నాయి. ప్రకృతి సిద్ధమైన సూర్యోదయం, రత్న శంఖాదులు కళక్రిందికి రావని హెగిల్‌క్రోచే మొదలైనవారంటారు. ఏది ఎలావున్నా ఇది ఒక మతం. నాలుక, చర్మం, ముక్కు ఈమూడు ఇంద్రియాలకూ గోచరించే కొన్ని విశిష్టవిషయాలుకూడా కళక్రిందికి వస్తాయని కాంట్ మొదలైనవారు అంటారు. వీరి అభిప్రాయం ప్రకారం కొన్ని కొన్ని ఆసవాలు, అలిప్త ఆలింగనాదులవంటి స్పర్శవిష యాలు, కొన్ని కొన్ని పూవుల తావులు కళక్రిందికి వస్తాయి. ఇది మరొకమతం. ఈరెండు మతాలు నిలుస్తాయా నిలవవా అన్నసంగతి తరువాత చూదాము. ప్రస్తుతానికి వీటినికూడా ఆమోదిస్తే ఇంద్రియాలకు గోచరించే విశిష్ట విషయాలు కళ

క్రిందికివస్తాయి. ఈ నిర్వచనం ప్రకారం కళకానివి ఏవంటే తీయని తలపోతలు, మధురస్వప్నాలు, భౌతికాలుకాని రమ్య భావనలు.

ఏది ఎలావున్నా కృతులు విశిష్ట భౌతిక విషయాలు. భౌతికత్వం లేక కళాత్వం పొందటంలేదు. అంటే ఇంద్రియ గోచరతలేక కళాత్వం లేదన్నమాట. ఇంద్రియ గోచరతవల్ల కృతులు విషయాలవుతున్నాయి. మల్లెపూవు విశిష్ట పుష్పమైనా పుష్పం కాకపోదు, అలాగే కృతి విశిష్ట విషయమైనా విషయం కాకపోదు.

అయితే విషయాలు, మన ఇంద్రియాలకు గోచరించే వస్తువులు ఏమిటి? అవి మనఃకల్పితాలా? లేక స్వతంత్రంగా వుంటున్నాయా? వీటితత్త్వం ఏమిటి? ఈ ప్రశ్నకు చెప్పు కొనే సమాధానం మీదనే కళ, రామణీయకం, యథార్థతా అయథార్థతలు,స్వతంత్రతాస్వతంత్రతలు, కళాస్వరూపం,ప్రయో జనం ఆధారపడుతున్నాయి. ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పు కోవటం కోసమే తత్త్వశాస్త్ర వేత్తలమీదను, ఇతరశాస్త్రకారుల అభిప్రాయాల మీదను, వారి పరిశోధనల మీదను ఆధారపడు తున్నాము.

ఇంద్రియాలకు గోచరించే యీ విషయా లేమిటి అన్న ప్రశ్నకు పరస్పరంగా సమాధానాలు చెబుతున్నారు. కళాస్వరూ పం అర్థం నిర్వచింప దలచుకొనినవాడు ఈ మతాలను స్పృశించకుండా వుండటానికి వీలులేదు. అయితే అలాంటి సావ కాశ చర్చకు ఇక్కడతావులేదు. కళనుగూర్చి దిఙ్మాత్రంగా సూచించటమే నాకర్తవ్యం.

విషయాలనుగూర్చి, భౌతికవస్తువులను గురించి అనేక సిద్ధాంతాలున్నా మొత్తంమీద వీటిని మూడువిభాగాలు చేయ

వచ్చును. 1. ఆధ్యాత్మిక దృగ్వాదం (Subjective Idealism), 2.ఆధ్యాత్మికదృశ్యవాదం (Objective Idealism), 3.భౌతికవాదం.

ఆధ్యాత్మిక దృగ్వాదులు విషయాలన్నీ మనః కల్పితాలే కాని యథార్థాలు కావంటారు. అంటే మన యింద్రియాలకు, మనస్సుకు గోచరించేవన్నీ ప్రాతిభాసికాలే కాని యథార్థాలు కావంటారు. అంతమాత్రం చేతనే కేవలం శూన్యం మాత్రమే ఉన్నదని అర్థంచేసుకోరాదనీ, ఒకానొక సత్పదార్థం ఉన్నదనీ, మనోవృత్తివల్లనే నానాత్వం గోచరిస్తున్నదనీ అంటాడు శంకరుడు. బర్క్లీ, కాంట్ మొదలైనవారు యీ తరగతిలోనివారే. భౌతిక పదార్థాలు యథార్థాలుకావు, ప్రాతిభాసికాలు అనటంలో ప్లేటో అగ్రేసరుడు. ఈ సిద్ధాంతం అంగీకరిస్తే ఇతర రంగాలలో ఎలాంటి పర్యవసానం ఏర్పడుతుందో మనకు అవసరంలేదు. మనకు కళ ముఖ్యం కాబట్టి యీ రంగంలో ఎలాంటి పర్యవసానం ఏర్పడు తుందో చూదాము. కృతులలో పరిణామం ఉండటానికి వీలు లేదు. 2. కృతులలో తారతమ్యా లుండటానికివీలులేదు. అంటే కాళిదాసు శాకుంతలము, పెద్దన మనుచరిత్రఒకటే; తేడాలుండ టానికి వీలులేదు.

ఈ రెండు పర్యవసానాలు అంగీకరించటానికి వీలవు తుందా? పరిణామం లేకపోతే విజ్ఞులు శైలినిబట్టి, భాషనుబట్టి శిల్పం మొదలైనవాటినిబట్టి కృతికాలాన్ని ఎలా నిర్ణయిస్తున్నారు, ఇలాంటి నిర్ణయాలు కేవలం నేల విడిచిన సాములు కావాలి. కృతులలో తారతమ్యాలు లేకపోతే చిత్రప్రదర్శన శాలకు వెళ్ళి చిత్రాలుకొనేవారు, బొమ్మలదుకాణానికివెళ్ళి బొమ్మలు కొనే వారు చేతికి వచ్చిన వాటిని కొనాలి. అలా జరుగుతున్నదా ? ఈ ప్రశ్నకు రసవాదులు ప్రత్యుత్తరం చెప్పుకోవాలి.

ఆధ్యాత్మిక దృశ్యవాదుల ననుసరించి భౌతిక విషయాలు అంగాలనీ, అంగాలుగా మాత్రమే అవి యథార్థాలనీ గ్రహించాలి.

అంటే మనిషి అవయవాలు మనిషిని విడిచి ఉండనట్లే జగత్తు లోని వివిధ అంగాలుకూడ జగత్తును విడిచి వుండవు. తన అంగాలకన్న మనుజుడు ఎలా విశిష్టుడు, అధికుడు అవు తున్నాడో అలాగే భావం( Idea) ఈ భౌతిక విషయ సమూహం కంటే విశిష్టము, అధికము. భావం కొన్ని తార్కిక సూత్రాల ననుసరించి పరిణామం పొందుతూ వుంటుంది. ఇది హెగిల్ వాదం. ఈ వాదాన్ని అనుసరించి ప్రతిదీ విధిగా మారుతూ ఉంటుంది. ఇలాంటి పరిణామంలో పూర్వ పూర్వ దశలకంటె ఉత్తరోత్తర దశలు విధిగా అభ్యుదయకరాలు (Progressive). సాహిత్యరంగంలో దీనిని ఆమోదించటమంటే షేక్స్పియర్‌కన్న బెర్నార్డ్‌షా ఉత్తమ నాటక రచయిత కావాలి. పైగా ఈవాదాన్ని అనుసరించి కళ మతంగా, ఆ మతం తత్త్వశాస్త్రంగా పర్యవ సించాలి. అంటే కళ ఒకానొక దశలో అంతరించి పోవాలి. ఇది ఎంతవరకు అంగీకరించటానికి వీలవుతుంది? కనీసం కళ అంతరించే చిహ్నాలైనా కనిపిస్తున్నావా ?

భౌతికవాదంలోకూడా ఆధ్యాత్మిక వాదంలోవలె అనేక మతాలున్నాయి. లోగడచెప్పుకొన్నట్లు వాటినన్నిటినీ ఇక్కడ విశదంగా చర్చించుకోటానికి వీలులేదు. కేవలం గతితార్కిక భౌతికవాదాన్ని (Dialectical Materialism) టూకీగా చూదాము. ఈ వాదం హెగిల్ భావా(Idea) నికిచ్చిన ప్రాముఖ్యం పదార్థానికి (Matter) ఇస్తుంది. హెగిల్ పరిణామానికి కారణం కేవలం భావమేనంటాడు. గతితార్కిక భౌతికవాది వస్తూత్పత్తి విధాన మంటాడు. భౌతిక వాది అయిన మార్క్స్ మానవునికి, అంటే అతని భావాలకుకూడా ఒకచోటుస్థానమిచ్చాడు. ఇదికూడాఅంగీక రిస్తే మార్పుకు ఉత్పత్తివిధానము, భావము కారణాలవుతున్నాయి. దీనివల్ల ద్వైతమేర్పడుతున్నది. రెండుమతాలు అభ్యుదయం

అనివార్య మంటాయి. రెండువాదాలు పూర్వపూర్వ దశలకంటె ఉత్తరోత్తర దశలు ఉత్తమాలంటాయి. వీటినిఅంగీకరిస్తే ఎలాంటి ఫలితా లేర్పడుతాయో ఇంతకుముందే చూచాము. ఉత్తరదశల్లో మానవునకు పూర్వదశలోనికృతులు ఎలా అస్వాద్యాలవుతాయో ఈ వాదం వివరించజాలదు. ఈవిషయం మార్క్సుకూడ గ్రీక్ శిల్పాన్నిగూర్చి ప్రస్తావనవచ్చినప్పుడు అంగీకరించాడు. పైసమాన లోకనాన్నిబట్టి పైవాదాలేవీఆదరణీయాలుకావనిస్పష్టమౌతున్నది. అవి సమాదరణీయాలు కావంటున్నామంటే కృతులను గూర్చి కొన్నిసిద్ధాంతాలను ఆమోదించామన్నమాట. (1) కళారంగంలో పరిణామం ఉంది. అయితే యీపరిణామం విధిగా అభ్యుదయికం కావాలన్న నియమంలేదు. (2) కృతులు పరిణామంలో ఏ దశకు చెందినవైనా ఆస్వాద్యాలే. అంటే అన్ని యుగాలలోను కొన్నికొన్ని కృతులు ఆస్వాద్యాలుగా వుంటాయి. 3. కృతులలో తారతమ్యా లుంటాయి. అంటేకక్ష్యలుంటాయి.

కాగా మనం ప్రతిపాదించే సిద్ధాంతం ఎలాంటిదైనా పై మూడు సూత్రాలను సమర్థించాలి. ఎందుకంటే అవి త్రోసి వేయరాని వాస్తవాలని (Facts) భావిస్తున్నాము.

ఇంతకూ మనఇంద్రియాలకు గోచరిస్తున్న విషయాలేమిటి? ఈ ప్రశ్న అలాగే వున్నది. ఈ ప్రశ్నకు సమాధానంచెప్పుకోకుండా కళా స్వరూపం చెప్పుకోలేమని ఇదివరకే తెల్పుకొన్నాము. ఒకే విషయం భిన్న భిన్న పరిస్థితులలో భిన్నభిన్నంగా గోచరిస్తున్నంత మాత్రాన యథార్థంకాదని భావించ నవసరంలేదు. అసలు అయు థార్థాలు కావు. ఉదాహరణకు త్రాడే తీసుకొందాము. త్రాటిని చీకటిలో పామనుకొని భయపడవచ్చును. ఇక్కడ మనం దేనిని అయథార్థమంటున్నాము. త్రాడు అయథార్థమా? లేక భయపడ టం అయథార్థమా? సాధారణంగా త్రాడూ యథార్థమే, త్రాటిని

పామనుకోటం యథార్థమే. కాని త్రాటిలో పాము మాత్రం అయథార్థమంటారు. అయితే త్రాటిలోపాము అయథార్థమంటే అర్థమేమిటి? అతనికి త్రాటిలో పాము కనిపించ లేదనా? కనిపించలేదంటే భయపడవలసిన అవసరంలేదు. కనిపించిందంటే త్రాడులో పాము లేదుకదా అనవచ్చును. కాని కనిపించినమాట నిజం. అయితే త్రాడు ఎలా పాముగా కనిపించింది అన్నదే ప్రశ్న. ఏయే పరిస్థితులలో అలా కనిపిస్తుందో పరిశీలించటం అవసరం. శాస్త్రకారుడు ఆ కనిపించేది యథార్థమని గ్రహించి ఎలాంటి పరిస్థితులలో అలా కనిపిస్తుందో కనుగొంటాడు. కాని అది అనిర్వచనీయం, మిథ్య అని ఊరుకోడు. అలా ఊరుకోవటమంటే శారీరక మానసిక రోగాలకు నివృత్తి లేకపోవాలి. వస్తుతత్త్వం తెలుపక మొదటినుంచి చివరవరకు అనిర్వచనీయం, అనిర్వచనీయమనాలి.

డాక్టరు పిచ్చివానిపిచ్చి యథార్థమని అంగీకరిస్తున్నాడు. కాబట్టి రోగం కుదర్చటానికి సమర్థుడౌతున్నాడు. అయథార్థమని భావిస్తే రోగానికి మందే లేకపోవలసి వస్తుంది. ఔషధం పనిచేస్తున్నదంటే ఉన్నదానిమీద పనిచేస్తున్నది కాని లేనిదానిమీద కాదుగదా! అందువల్ల ఒకె విషయం ఎంత పరస్పర విరుద్ధజ్ఞానాలు కలిగించినా, ఎంతవిరుద్ధ గుణాలు కలిగినది అయినా యథార్థం.

విషయం యథార్థ మైనప్పుడు కృతియథార్థమే అవుతున్నది. అదిఛందో బద్ధమైనా, శిలాభివ్యక్తమైనా, వర్ణాభివ్యక్తమైనా యథార్థమే. గద్యాభివ్యజ్యమాన మౌతున్నంత మాత్రాన వాస్తవమె పద్యాభివ్యజ్యమాన మౌతున్నంతమాత్రాన అవాస్తవం, అయథార్థం కాదు. తత్త్వాన్వేషకుడు భిన్నభిన్న పదార్థాలద్వారా అభివ్యక్త మౌతున్న కృతులను యథార్థమని గ్రహించి ఏయే పరిస్థితులలో అలా అభివ్యక్త మౌతున్నవో, వాటి ప్రయోజనాలేమిటో

అర్థాలేమిటో నిర్ణయించాలి. ఆయా స్థితిగతులను సరిగా తెలుసుకో గలిగినప్పుడే వాటి అభ్యుదయానికి పాటుపడ గలుగుతాడు. అప్పుడే కృతులను సంపూర్ణంగా ఆనందించ గలుగుతాడు. లేని నాడు ఆత్మగతంగా వాటిని అయథార్థాలను కోవటం, ద్వేషించటం, వానిని ఆస్వాదించలేకపోవటం జరుగుతుంది. అలాంటప్పుడు అతని ప్రయత్నాలు, ఆవేశాలు నిరర్థకాలవుతాయి. అందువల్ల కృతులు అయథార్థాలు అన్నవాదనకే ఆస్కారం లేదు.

యథార్థమైన విషయం దృక్కా (Subject), లేక దృశ్యమా (Object) అన్న సమస్య వస్తుంది. ఈ విషయాన్నిగూర్చి తాత్త్విక రంగాలలో ఎన్నో తీవ్రవాద ప్రతివాదాలు జరిగాయి. కేవలం ఏకత్వవాది మతం ప్రకారం అంతాదృక్కే అవుతుంది. కేవల ద్వైతవాదికి ఈశ్వరుడు వినా మిగిలినవన్నీ దృశ్యాలే అవుతాయి. అయితే ద్వైతవాది మతం అనుసరిస్తే అనేక బాధలున్నాయి. దృక్కునకు దృశ్యానికి సంబంధం లేకపోవలసి వస్తుంది. కేవల ఏకత్వవాదం అవలంబించినా దృశ్యంలేకపోవలసి వస్తుంది. అప్పుడు వివిధ విషయాలు యథార్థాలు కాకపోవలసి వస్తుంది. అయితే మనం విషయాలు యథార్థమని అంగీకరించాము. విషయాలు యథార్థమంటున్నా మంటే పరిణామాన్నికూడా ఏదో ఒక రూపంలో అంగీకరించినట్లే. అయితే పరిణామ పూర్వకమైన కేవల ఏకత్వవాదాన్ని అనుసరించటమంటే హెగిల్ సిద్ధాంత కూపంలో ఒక్కసారిగా పడటమౌతుంది. దానివల్ల లోగడ చెప్పి కొన్ని బాధలన్నీ వస్తాయి. వీటన్నిటిని పరిహరించాలంటే విధిగా, ఏకత్వవిశిష్ట బహుత్వం (Monistic Pluralism) ఆమోదించాలి. అప్పుడు హెగిల్ వాదంలోని బాధలుకాని, అద్వైత వాదంలోని బాధలుకాని రావు. అప్పుడు ఒకే విషయం దృక్కూ అవుతుంది, దృశ్యమూ అవుతుంది. ఇది అసంభవంగా కనిపించవచ్చును.

కాని నిజానికి ఇందులో అసంభవం ఏమీలేదు. ఉదాహరణకు నేను వున్నాను. నాకు నేను దృక్కును. మీకు నేను దృశ్యాన్ని కాబట్టి నేను దృక్కునూ అవుతున్నాను. దృశ్యాన్ని అవుతున్నాను.

ఈ విధంగా విషయం యథార్థమౌతున్నది. యథార్థమవ్వటమే కాక ఒకదృష్టితో దృశ్యమూ, మరొకదృష్టితో దృక్కు అవుతున్నది. దీనినిబట్టి కృతికూడా యథార్థం, దృక్కు దృశ్యమూ అవుతున్నది.

అయితే ఒకేపదార్థం ఈ జగత్తులోని నానాత్వానికి మూలమనీ, ఈ నానాత్వం యదార్థమనీ అంగీకరించాము. అంటే ఒకేపథార్థం జడమూ చేతనము అవుతున్నది. అంతే కాని జడములన్నీ ఒక పదార్థమై చేతనములన్నీ మరొక పదార్థంకావు. నీరు జడమేకదా. ఆ నీరే మురిగినప్పుడు క్రిమిసముత్పాదక మౌతున్నది. సచేతనమైన శరీరంలోనుంచి జడాలైన నఖకేశాలు పుడుతున్నాయి. అలాగే ఒకపదార్థం అనేక భిన్నభిన్న వస్తువులుగా అభివ్యక్తమౌతున్నది. భిన్నభిన్న ధర్మాలను ప్రదర్శిస్తున్నది. ఒకే పదార్థం ఆవిరి, నీరు, మంచుగడ్డ అవుతున్నది. ఆవిరిరూపములో ఉన్నప్పుడు వాయుధర్మాలను అభివ్యక్తంచేస్తున్నది. నీటిరూపంలో ఉన్నప్పుడు ద్రవధర్మాలను, మంచుగడ్డ రూపంలో వున్నప్పుడు ఘనధర్మాలను ప్రకటిస్తున్నది.

ఒకే పదార్థం ఇలా నానాత్వం పొందగలదని అంటున్నామంటే అనంతశక్తి దానికున్నదనీ, ఆ పదార్థానికి మరొక దాని సహాయం అవసరంలేదనీ, "అంటే స్వయం సంపూర్ణమనీ అంగీకరిస్తున్నాము." స్వయం సంపూర్ణమైన యీ పదార్థం ఎందుకున్నది ఎందుకు నానారూపాలతో అభివ్యక్తమౌతున్నది? అన్న ప్రశ్న కొందరు వేస్తారు. ఈ ప్రశ్నవల్ల ప్రయోజనం లేదు. ఎందుకంటే ఇది

అనవస్థా దోషరూపంలో పడదోస్తుంది. అందువల్ల ఎలా అభివ్యక్త మౌతున్నది అన్నది ఒక్కటే సరియైన ప్రశ్న. ఈప్రశ్నకు జగత్తు యొక్క స్థితి వికాసాల పరిశీలనమే సమాధానం చెబుతుంది.

ఒకేజగత్తు పదార్థంతో ఏర్పడింపనీ, ఈజగత్తు స్వయం సంపూర్ణమనీ అంగీకరించినప్పుడు మరొకటికూడా అనివార్యంగా సిద్ధిస్తున్నది. ఈ జగత్తు తనకు తానుగా పుట్టుతున్నది కాని మరోదానికి సాధనం కాదు. అంటే ఈజగత్తు ఈశ్వరుని క్రీడకోసం గాని, లేక జీవుల మోక్షానికి కాని యేర్పడటంలేదు. జగత్తు ఇలాంటి దైనప్పుడు జగత్తులోని స్వయం సంపూర్ణములైన విషయాలుకూడా తమకు తామే పరమార్థాలవుతున్నాయి. ఉదాహరణకు గుఱ్ఱాలు, ఏనుగులు మొదలైన జంతువులను తీసుకొందాము. ఇవి పదార్థ పరిణామంలోని ధర్మంవల్ల ఏర్పడ్డవే కాని కేవలం మానవుని ఉపయోగంకోసం ఏర్పడ్డవి కావు. వాటి జీవితం వాటికుంది. జగద్వికాసంలో వాటిస్థానం వాటికుంది. అయితే వాటిని మానవుడు వినియోగపరచు కొంటున్నాడంటే అది వేరే సంగతి. పరిణామంలోఅవి ఉత్తరదశకు సాధనాలవు తున్నాయా లేదా అంటే నిజమే. కాని ఆవిర్భూతిలో మాత్రం వేటికవే పరమప్రయోజనాలు. జగత్తులోని ప్రతి అంగంకూడా ఈ అస్తిత్వ స్వతంత్రత్వాన్ని స్వయం సంపూర్ణతను చాటుతున్నది.

ఇదే మానవునకుకూడా అన్వయిస్తుంది. జగత్తు ఇంతవరకు పొందిన పరిణామంలో ఉత్తమస్థాయి మానవుడు. అతనిలో పదార్థంపరాకోటి కందుకొన్నది. జగత్తత్త్వం అతనిద్వారా అభివ్యక్తమౌతున్నది. అంటే స్వయంసంపూర్ణత్వం అనంతశక్తిమత్త్వం అతనిలో ఉన్నాయి. అతనికి అతడే పరమార్థం. అంతేగాని అతడు మరొకదానికి సాధనం కాదు. అంగాలకు అంగికి ఉన్న సంబంధం కాని, జీవికీ దాని అవయవాలకూ ఉన్న సంబంధం కాని, సంఘానికీ మానవునికూ లేదు. ఎందుకంటే సంఘం

లేకపోయినా మానవుడు విడిగా బ్రతికినయుగాలున్నాయి. అందు వల్ల మానవుడు ఉనికినిబట్టి, ఆవిర్భావతినిబట్టి మరొకదానికి సాధ నం కాడు. ప్రతిఒకమానవుడు స్వయం సంపూర్ణుడు, అనంతశక్తి సంపన్నుడు. తనకుతానేపరమార్థం. అందువల్ల ఇలాంటిస్వయం సంపూర్ణ వ్యక్తులమధ్య సహకారం ఏర్పడటానికి వీలున్నది కాని, సేవకసేవ్యభావంకాని, అంగాంగి భావంకాని ఏర్పడటానికి వీలు లేదు. కేవలం అంగాంగిభావం, సేవకసేవ్యభావం ప్రబోధించే ప్లేటో, హెగెల్, మార్క్స్ మహాశయులసిద్ధాంతాన్ని ఆమోదించ టానికి వీలులేదు. ఏకాకిగా కంటే ఇతరుల సహకారంతో ఆత్మ శుద్ధి, లేక ఆత్మ అభివ్యక్తి పొందటానికి ఎక్కువ అవకాశాలుంటు న్నాయి. కాబట్టి అతడు సామాజికజీవి అవుతున్నాడు. సమాజం అలాంటి అభివ్యక్తికి ప్రతిబంధకమైనప్పుడు అతడు దానిని మార్చ టానికిప్రయత్నిస్తున్నాడు. మారుస్తున్నాడు. మార్చలేనప్పుడుతాను మారుతున్నాడు. అలామారడానికి కూడ వీలులేనప్పుడు వీరమర ణం పొందుతున్నాడు, అందువల్ల మానవునకు సామాజిక జీవనం సాధనమేకాని పరమార్థంకాదు. అంటే సమాజంకోసం మాన వుడులేడు. మానవుడు ఆత్మాభివ్యక్తికోసం సమాజాన్ని సృష్టించు కొన్నాడు. అందువలన సమాజం సాధనమేకాని సాధ్యంకాదు.

అయితే వస్తుగుణ సమాహారాన్ని మించి వస్తువు లేనట్లుగా మానవగుణ సమాహారాన్ని మించి మానవుడులేడు. అంటే జ్ఞాన కర్మలను మించి మానవుడులేడు. ఆ జ్ఞానకర్మలే మానవుడు. జ్ఞానము, కర్మము అని చెబుతున్నామంటే అవి కేవలం ఒందొం టితో సంబంధంలేని విభిన్న ధర్మాలని చెప్పటంలేదు. మనో వ్యాపారంవల్ల కలగని జ్ఞానంకాని, పరస్పరద్‌జ్ఞానంకానికర్మకాని లేదు. అయినా వివరణకోసం తార్కికంగా జ్ఞానము, కర్మ అని విభజిస్తున్నాము. అద్వైతులు, క్రోచేలాంటి ఆధ్యాత్మిక వాదులు మాత్రం జ్ఞానం కేవలం నిష్క్రియం మంటున్నారు. జ్ఞానం నిష్క్రియ మనటంవల్లనే క్రోచే కృతికి భౌతికత్వంకాని, కుల వృత్తులకు కళాత్వంకాని ప్రతిపాదించలేకపోయాడు. మనస్సు లోనే కృతిపూర్ణత పొంది తరువాత కేవలం భౌతికత్వంలోకి

అనువదింపబడుతుంది అన్నాడు. ప్రతిపనులలో అసలు కళ లేదన్నాడు. ఈ వాదన అనుభవానికి కేవలం విరుద్ధం. ఎందుకంటే క్రోచేవాదమే నిజమైతే కృతికర్త తనకృతిని తిరిగి సవరించుకోటం జరగదు. అనేక మహాకవులు సవరించటం జరిగింది. అలా సంస్కరించిన పాఠాలు లోకోత్తరంగా ఉన్నాయి. పైగా మహాకృతికర్త తన కృతినంతా పూర్తిగా మనస్సులోనే సృష్టించటం అసంభవం. కాకపోతే ఒక ఆవేశంతో అతడు కృతి నిర్మాణం ప్రారంభిస్తాడు. కొన్నికొన్ని సన్నివేశాలు చిత్రవిధానాలు అతన్నే విస్మితుణ్ని చేస్తుంటాయి. ఇలా మహాకృతి ఎప్పుడూ క్రమంగా వికసిస్తుందితప్ప అమూలాగ్రంగా ఒక్కసారిగా ఊడిపడదు. చిన్నచిన్న కృతులలో ఇలా కాకపోవచ్చును. ఇది వేరేసంగతి. కాబట్టి జ్ఞానం కేవలం నిష్క్రియం కావటానికి వీలులేదు,

ఈ జ్ఞాన కర్మలే మానవజీవితం. ఇవిలేని జీవితంలేదు. జీవితం లేక మానవుడులేడు. అయితే జ్ఞానాన్ని రెండు భాగాలు చేయవచ్చును. ఒకటి ప్రమాత్మకమైనది (Subjective), రెండు దృశ్యమైనది. (Objective). మొదటిది లేకుండా రెండోది ఎప్పుడూ లేదు. ఇందులో ఒక్కొక్కటి తిరిగి రెండు భాగాలౌతుంది. ప్రమాత్మక జ్ఞానం మనోవ్యాపార భేదములనుబట్టి రెండు భాగాలు అవుతున్నవి. దృశ్యజ్ఞానం సాధారణ వృత్తినిబట్టి రెండు భాగాలవుతున్నది. ఇందులో మొదటిభాగమే వృత్తులు, లేక చిత్ర కళలు (Arts), రెండోభాగం లలితకళలు, మూడోభాగం శాస్త్రాలు (Sciences), నాలుగోభాగం తత్త్వం (Philosophy). పరిణామాన్ని అనుసరించి చిత్రకళలు మొదటివి. తరువాత వచ్చినవి లలిత కళలు, ఆ తరువాత వచ్చినవి శాస్త్రాలు. ఆ తరువాత వచ్చినది తత్త్వం. ఇందులో ఏ ఒకటి మొదటిదైనంతమాత్రాన హీనమైన తరువాతదైనంత మాత్రాన ఉత్తమం కాదు.

కర్మప్రవృత్తి జ్ఞానం అపేక్షిస్తుంది. జ్ఞానంలేకుండా మానవుడు ఎప్పుడూ కర్మచేయడు. ఏదో ఒకవిధమైన జ్ఞానం వున్నప్పుడే

ప్రతడు క్రియకుపక్రమించటం జరుగుతుంది. అలాంటి జ్ఞానం లేకుండా ఎలాంటి కర్మ జరగదు, అయితే ఈ కర్మక్షేత్రంలోనే ధర్మాధర్మ సమస్య వస్తున్నది. ఏది ధర్మం అన్న విషయంలో అయిదు మతాలున్నాయి. (1) కేవల పారమార్థికవాదం. వీరి మతం ప్రకారం సర్వకాల సర్వావస్థలలోను ధర్మం ఒకటే. ఈ ధర్మం పరిణామం పొందదు. కాంట్ మొదలైనవారి సిద్ధాంతాలు దీనిక్రిందికే వస్తాయి. (2) పారమార్థిక ప్రయోజనవాదం. ఈ మతం ప్రకారం ధర్మం పైమతంలోవలె పారమార్థికం (Absolute). అయితే మోక్షసిద్ధికి తోడ్పడేదంతా ధర్మం. అలా తోడ్పడనిది అధర్మం. హిందూ ధర్మమంతా ఈమతం క్రిందికి వస్తుంది. (3) కేవలం ప్రయోజనం సాధించేదంతా ధర్మం. సాధించలేనిది అధర్మం. బెంథాము, స్టూవర్ట్‌మిల్ మొదలైన యుటిలిటేరియన్ వాదుల మతమంతా దీనిక్రిందికి వస్తుంది. (4) సాపేక్షవాదం. ఇది మొదటిదానికి కేవలం విరుద్ధం. ధర్మమనేది పారమార్థికం కాదనీ, సామాజిక స్థితిగతులనుబట్టి ధర్మం ఉంటుందనీ యిది చెబుతున్నది. (5) కడపటిది అంతఃకరణ ప్రామాణ్యవాదం (Intuitional Ethics) ఈ మతం ప్రకారం అంతఃకరణం అంగీకరించినదంతా ధర్మం. అంగీకరించనిది అధర్మం. ఈవాదంలో జ్ఞానానికి శాస్త్రానికి తావులేక పోతున్నది.

జ్ఞానం పారమార్థికం (Absolute) కాదని లోగడ ప్రతిపాదించిన దానినిబట్టి మొదటి మతం అంగీకరించటానికి వీలు లేదు. జగత్స్వయంభువత్వాన్ని, స్వయం సంపూర్ణతను అంగీకరిస్తున్నాము కాబట్టి రెండోమతం ఆదరించటానికి వీలులేదు. కేవలం ప్రయోజనకారి అయినదే ధర్మం అనేపక్షంలో ఒక కర్మను ఫలప్రదమయ్యేటంతవరకూ ధర్మమని కానీ, అధర్మమని కానీ చెప్పటానికి వీలులేదు. ఆ మధ్యకాలంలో అది అర్థరహితం అవుతున్నది. కార్యసాధకమే అవుతుందని చేసినప్పుడు ధర్మమై విఫలమైనప్పుడు అధర్మమవుతున్నది. అందువల్ల మూడోమతాన్ని ఆదరించటానికి వీలులేదు. సాపేక్ష వాదంలో

సోదరమానవ అనురాగం మొదలైన త్రైకాలిక ధర్మానికి, హిం
చౌర్యాదిత్రైకాలిక అధర్మానికి తావులేకుండా పోతున్నది. అం
వల్ల సాపేక్ష వాదాన్ని ఆమోదించటానికి వీలులేదు. మిగిలి
అంతఃకరణ ప్రామాణ్యవాదం జ్ఞానానికి తావివ్వటంలేదు కాబ
ఆదరణీయంగాదు.

అయితే ధర్మం అనేది లేదా అన్న ప్రశ్నవస్తుంది. కల
అంటూ ఉన్నంతకాలం ధర్మాధర్మాలు ఉంటూనే ఉంటాయి
వివేకవిహితము (Rational), స్వతః ఆచరణీయము అయినది కర
ధర్మం. ఫలావాప్తికీ, ధర్మాధర్మాలకు సంబంధంలేదు. త
బిడ్డను ప్రేమిస్తుంది. ఆ బిడ్డ పెరిగి పెద్దదై ద్రోహంచేయవచ్చును
తల్లి బిడ్డయందు అనురాగం చూపించటం ధర్మం. ఒకలక్షా
కారి అయిన దాయాదిని చంపితే డబ్బురావచ్చును. ఆ డబ్బును
దేశసేవకు వినియోగించవచ్చును. అంతమాత్రంచేత అలాంటి
కర్మ ధర్మంకాదు. పెట్టుబడిదారీ విధానం లక్షలాది ప్రజల
కడుపుకొట్టి కోట్లకొలది డబ్బుకూడబెడుతుంది. ఆ విధానం
తత్త్వం తెలుసుకోవడం దానిని పరిహరించటం ధర్మం
ఈ విధంగా జ్ఞానంపెరిగిన కొలది ధర్మం పెరుగుతూ ఉంటుంది
కాని లోగడ దశలోని ధర్మం ఉత్తరదశలో అధర్మంకాదు
ఇలాంటి వాదాన్ని అసాపేక్ష వాదమనవచ్చును. దీనినిగూర్చి
ఇంతకన్నా విశదంగా ఇక్కడ చర్చించటానికి అవకాశంలేదు.

ఈపైఅంశాలనుఅంగీకరిస్తే కళ, శాస్త్రం, దర్శనం, ధర్మం
వీటి స్వరూపం, పరస్పర సంబంధం ఈ క్రిందివిధంగా ఉం
టుంది. మానవుడు తనకు తానే పరమార్థం కాని మరొక దానికి
సాధనం కాదని చెప్పుకొన్నాము. కళగా, శాస్త్రంగా, దర్శనంగా,
ధర్మంగా అభివ్యక్తమయ్యే అతని జీవితంకూడా తనకు తానే
పరమార్థం కాని మరొక దానికి సాధనంకాదు. అందువల్ల కళ,
శాస్త్రం, దర్శనం, ధర్మం అనేవికూడా తమకుతామే పరమార్థాలు
కాని మరొకదానికి సాధనాలుకావు. అంతే మరొకదానికి సాధనం
కావటంవల్ల కళ కళకావటంలేదు. అలాగే శాస్త్రాదులుకూడా.

ఇదిహాని ఆవిర్భూతికి, ఉనికికి సంబంధించిన విషయం. అవి మరొక దానికి వినియోగపడితే పడవచ్చును. అది వేరేసంగతి.

ఒక వాక్యం, ఒక రాగసంచారం పార్టీ ప్రచారానికో, మత స్థాపనకో, కాక ఒకానొక శాస్త్రార్థ నిరూపణకో తోడ్పడవచ్చును. అలా తోడ్పడు తున్నంత మాత్రాన అది కళ కావటంలేదు. యథార్థం కాబట్టే అది శాస్త్రమవుతున్నది. ఈఅర్థంలోనే కళ కళకోసమే శాస్త్రం శాస్త్రంకోసమే, ధర్మం ధర్మంకోసమేనని చెప్పటం జరుగుతున్నది. ఈ అర్థాన్ని గ్రహించక పోవటంవల్లనే కళ కళకోసమే నన్న వాదాన్ని గూర్చి ఎంతో దుష్ప్రచారం జరిగింది. ఇంకా జరుగుతూవుంది కేవలం ప్రయోజనమే కళాత్వాన్ని నిర్ణయించే పక్షంలో ప్రకృతిసిద్ధ సౌందర్యం సౌందర్యం కాక పోవాలి. ఈనాడు మనకు ప్రయోజనకారులు కావు కాబట్టి వెనకటి మహాకావ్యాలన్ని కావ్యాలు కాకపోవాలి. కేవల వర్ణనాత్మకములైన కృతులు, కావ్యాలు కాకపోవాలి. ఈగతి ఇలాగే ఇతర కళలకు పడుతుంది.

కాబట్టి కళ కళకోసమేనంటే జీవిత విశేషమే కళ అనీ, ఆకళ జీవితం కోసమేనని అర్థం. జీవిత విశేషమే కళ అయినప్పుడు కళ ప్రకృతికి అనుకృతికాని, ప్రతిబింబంకాని కాదు. మానవుడు ప్రకృతిపరిణామంలోని ఉత్తమ ఫలమేకాని, ఆ ప్రకృతికంటె భిన్నుడుకాదు. కాబట్టి అతని జీవిత విశేషమైన కళకూడా ప్రకృతియొక్క ఉత్తమోత్తమ దశాభివ్యక్తి అవుతుంది.

కళ, శాస్త్రము కేవలం జ్ఞానానికి సంబంధించినవి. ధర్మం కర్మక్షేత్రానికి సంబంధించినది. అందువల్ల కళకుగాని, శాస్త్రానికి గాని స్వతః ధర్మాధర్మ వివేచన ఏ మాత్రం అన్వయించదు. అణుశక్తిని, యాటంబాంబును కనిపెట్టటం అధర్మంకాదు. వాటిని దుర్వినియోగం చేయటం ప్రజలపై ప్రయోగించటం అధర్మం; ధర్మద్రోహం. అయితే లోగడ జ్ఞానంలోకూడా కర్మం వున్నదని చెప్పుకొన్నాముగదా! కాబట్టి ధర్మత్వాధర్మత్వం కళకు, శాస్త్రానికి ఎలా అన్వయించకుండా వుంటుంది? ఈ ప్రశ్న

సమంజసమే. కాని లోగడ స్వతః ఆదరణీయమైన కర్మ ధర్మమే నని చెప్పుకొన్నాము. వివేకవిహితమైనదికూడా ధర్మమని చెప్పుకొన్నాము. ఈ నిర్వచానాన్నిబట్టి కళగాని, శాస్త్రంగాని ధర్మ విరుద్ధంకాదు.

కాబట్టి కళలోను, శాస్త్రంలోను ధర్మప్రసక్తిలేదు. అంటే కళ మంచిచెడ్డలు, శాస్త్రంయొక్క మంచిచెడ్డలు ధర్మాన్నిబట్టి ఉండవు. దీనినిబట్టి కళలో, శాస్త్రంలో మంచి చెడ్డలుండవని అర్థంకాదు. ధర్మవిహిత కళ, అధర్మ విహిత కళ అనికాని, ధర్మ విహితశాస్త్రం, అధర్మవిహితశాస్త్రము అనికాని ఉండవు.

ఇక కళకూ, శాస్త్రానికీ ఉన్న సంబంధం పరిశీలింతాము. కళ—అంటే కృతి—స్వయంసంపూర్ణం; శరీరంలోని అంగాలు శరీరానికి అనుగుణంగా ఎలా సంపూర్ణతా ఏకత్వ సంపాదకలుగా వుంటాయో, కృతిలోని వివిధ అంశాలుకూడా అలాగే కృతికి అనుగుణంగా సంపూర్ణతా ఏకత్వసంపాదకాలుగా ఉంటాయి. అంటే కృతి భిన్నత్వంలో ఏకత్వం కలిగివుంటుంది. కృతి స్వయం సంపూర్ణం కాబట్టి ఏకత్వం పొందుతున్నది. కాబట్టి అనన్యం. అనన్యం కాబట్టి సాదృశ్యతకు, సంశయానికి, సంస్మరణకు, మిథ్యాత్వానికి తావులేదు. శాస్త్రమంటేనో అలాకాదు. అది స్వయంసంపూర్ణంకాదు. తన యథార్థతాయథార్థతలకు బాహ్య జగత్తుమీద ఆధారపడుతున్నది. అందువల్లశాస్త్రం ఎప్పుడూ సాపేక్షమే. అందువల్ల ఎప్పటికప్పుడు సంస్కారం పొందుతూ ఉంటుంది. కృతి అలాకాదు. ఒకసారివెలువడిన తరువాత సర్వ కాలాలకు సంస్కార మపేక్షించకుండానే ఆస్వాద్యమౌతుంది. ఇందుకు వాల్మీకి రామాయణం, భాసకాళిదాసాదుల కృతులు నిదర్శనం. రామాయణం కాని, శాకుంతలంకాని, మేఘదూతం కాని, కళాపూర్ణోదయం కాని షేక్స్పియర్ నాటకాలుకాని, సంస్కారం అపేక్షించక ఆస్వాద్యా లవుతున్నాయి. శాస్త్రాలు అలాకాదుకదా. పైగాకళ, అందులో సాహిత్యం, లేనిదశలో శాస్త్రం ఉండటానికి వీలులేదు. శాస్త్రమున్నప్పుడు కళకూడా ఉంటుంది. ఇందుకు మనతెలుగు సాహిత్యమే నిదర్శనం.

ఈరోజు వరకూ మనకు సరియైన శాస్త్రంలేదు. అయినా మనకు మహాకావ్యాలున్నాయి.

ఇలా అంటున్నామంటే శాస్త్రంకంటే కళ గొప్పదని కానీ, న్యూనమైనదని కాని అర్థం కాదు. దేని ప్రాముఖ్యం దానిదే. ఏది లేకపోయినా కొరతే. శాస్త్రాభావంవలని కొరతను కళగాని, కళాభావం వలని కొరత శాస్త్రంకాని తీర్చలేదు. ఇది ఇలా ఉండగా కళకూ శాస్త్రానికీ మరొక తేడావుంది. కళకు వ్యంజనావృత్తి ప్రధానం. శాస్త్రానికి తాత్పర్యవృత్తి ప్రధానం. మొత్తంమీద కళకూ శాస్త్రానికి ఉన్న ప్రధాన భేదాలు ఇవే,

ఇప్పుడు కళాస్వరూపం చెప్పకోవచ్చును. స్వయం సంపూర్ణము, అనన్యము, అఖండము, ఏకము, వ్యంజనావృత్తి ప్రధానము, ఇంద్రియ గోచరము అయిన జీవితంకళ. కళ, బాహ్య జగత్తు నపేక్షిస్తూ తాత్పర్యవృత్తి ప్రధానమైన శాస్త్రంకంటె, కర్తృ సంబంధిఅయిన ధర్మంకంటె భిన్నం. జాగ్రదవస్థాపేక్షము, కేవలం మనోగోచరము కాబట్టి స్వప్నంకళ కాదు. ఇంద్రియగోచరతలేదు. కాబట్టి స్వయంసంపూర్ణత లేదు కాబట్టి మధురభావన కాని, రమ్యస్మృతి కాని కళ కాదు. వ్యంజనావృత్తి ప్రధానము కాదు కాబట్టి, అసవఃలింగప్రవాసనా సంభూత అనుభూతి కళ కాదు. అందువల్ల కేవలం స్వయంసంపూర్ణం, అనన్యం, అఖండం, ఏకం, వ్యంజనావృత్తి ప్రధానం చక్షుశ్శ్రవణ గోచరమైనదే కళ అవుతున్నది. ఈ నిర్వచనాన్ని అనుసరించి స్వయంసంపూర్ణతాది గుణములు గలిగి వ్యంజనావృత్తి ప్రధానమైన శైలసాగరనదీ తటాకాదులు, తరులతా పుష్పకుసుమాదులు, స్వప్నము మానవ సృష్టములైన భవన విగ్రహ చిత్రసంగీత సాహిత్యాలు కళలు అవుతున్నాయి. అయితే కళాస్వాదన మనేది, కళాజ్ఞాన మనేది మానవునికి ఉన్నది. జగత్పరిణామంలో మొదటినుంచి కళలున్నా వాటి సంపూర్ణ గ్రహణం, సంపూర్ణ ఆస్వాదం మానవునితోనే ప్రారంభమయింది. ఇక్కడ సంపూర్ణమైన అన్న విశేషణం వాడటంలో ప్రయోజనమున్నది. ఎందుకంటె పశుపక్ష్యాదులలోకూడా కొంత కళాగ్రహణం, ఆస్వాదనం వున్నట్లు కనిపిస్తున్నది. పరిశీ

నృత్యంచేసే మగనెమలిని చూచి ఆడనెమలి పరవశిస్తున్నది. తృప్తిగా పాలుత్రాగి గంతులుపెట్టే దూడనుచూచి ఆవు సంతోషిస్తున్నది. గండుకోయిలకూతకు ఆడుకోయిల వివశత్వం పొందుతున్నది. పుంజు గోళ్ళతో భూమిపై గీరలుగీసి సంతోషంతో గొంతునిక్కించి తోకక్రిందికివంచి కూస్తున్నది. ఇలా ఎన్ని ఉదాహరణాలైనా ఇవ్వవచ్చును.

ఇది ఇలావుంచి మానవుడు ద్రష్ట దృశ్యము అవుతున్నట్లే, భౌతిక విషయమయిన కళకూడా ద్రష్ట దృశ్యమూ అవుతున్నది. అంటే కళ ఆస్వాదనలో ద్రష్ట, పరామర్శలో దృశ్యమూ అవుతున్నది. ఒకకృతి కళ అవునా కాదా అని నిర్ణయించాలంటే ఆస్వాదనను బట్టి నిర్ణయించాలి. పై గుణాలు, అంటే స్వయంసంపూర్ణత అనన్యత అఖండత. ఏకత, స్వాంతఃచక్షుశ్శ్రవణ గోచరత కలిగి సంతృప్తి కలిగించేది కళ అవుతుంది. కానిది కళ కాదు. కాబట్టి పైని చెప్పిన్న ప్రకృతి సిద్ధములు, మానవసిద్ధములు అయిన విషయములు స్వయం సంపూర్ణతాది గుణములు కలిగి ఉన్నప్పుడు కళ అవుతాయి. ఆస్వాదనలో ఏ కళ అయినా ఏ కృతి అయినా, అదికృతి కావాలికాని తారతమ్యాలకు తావులేదు.

పరామర్శలో మాత్రం అంటే దృశ్యంగా (Objective) చూచినప్పుడు మాత్రం అనుభవవిస్తృతినిబట్టి, గంభీరతనుబట్టి ఏ కళకు ఆ కళలో కక్ష్యలు ఏర్పడుతున్నాయి. తెలుగు భారతానికి మొదటి తరగతి, కళాపూర్ణోదయానికి పాండురంగ మాహాత్మ్యానికి రెండవ తరగతి ఇస్తున్నాము, ఇలా ఏ కళకు ఆ కళలో కక్ష్యలు ఏర్పడుతున్నవి.

కళా విభేదం సాధనాన్నిబట్టి ఏర్పడుతున్నది. ఏ కళకు ఆ కళ స్వయం సంపూర్ణం, అనన్యం కాబట్టి కళలలో ఎచ్చులొచ్చులు కాని, ప్రధానతా అప్రధానతలు కాని లేవు. మన పంచేంద్రియాలలోని ఏ ఇంద్రియం ప్రాధాన్యం కానిదె. ఒక ఇంద్రియంలోటు మరొక ఇంద్రియం తీర్చలేదు. అలాగే లలితకళల్లో ఏ ఒక దాని పాత్రను మరొకటి నిర్వహించలేదు. అందుచే లలితకళలన్నీ ఆస్వాదనలో నేమి దృశ్యంగానేమి సమములే.

# అనువాదము

జ్ఞానస్వరూపం

ఆత్మస్వరూపం

సృష్టిక్రమం

ధర్మస్వరూపం

ఆదర్శరాజ్యం

రామణీయక విచారణ

# జ్ఞానస్వరూపం

కళల తత్త్వం తెలిపేదానిని అలంకార శాస్త్రమంటారు. ఈతత్త్వ విచారం అత్యంతప్రాచీన కాలంనుంచి కనిపిస్తున్నది. వేదంలోకూడ ఈ శాస్త్రవిచారస్పర్శ ఉన్నదంటున్నారు.

ఏది ఎలాఉన్నా అలంకారశాస్త్రంలో మొట్టమొదట వచ్చినది అనుకరణవాదం. అంతకుముందు వాదాలు లేవనికాదు. కాని శాస్త్రమార్గం అవలంబించి ప్రతిపాదించినవాటిలో అనుకరణవాదమే మొదటిది. ఈ అనుకరణవాదంలో అనేకభేదాలున్నాయి. ఒకటి ప్లేటో ప్రతిపాదించినది. రెండు అతని శిష్యుడైన అరిస్టోటల్ ప్రతిపాదించినది. మూడోది భరతుని మతం. భరతునిమతమే ప్రాచీనతమమని వాదించేవారు ఉన్నారు. కాని అది వివాదగ్రస్తం. భరతుని మతం వదలిపెడితే మొట్టమొదటిది ప్లేటో వాదమే.

ఏ వాదమైనా సమగ్రంగా అర్థంచేసుకోవాలంటే ఆ వాదం బయలుదేరిన నాటి సామాజికస్థితిగతులు, రచయితజీవితచరిత్ర, అతనిచే ప్రతిపాదితమైన జ్ఞానస్వరూపం, అతని ఇతరకృతులు, తరువాత అతనివాదం పరిశీలించాలి. లేకపోతే అపార్థం చేసికోవటం జరుగుతుంది. ముఖ్యంగా ప్లేటో అనుకరణవాదవిషయంలో చాలమంది అపార్థం చేసుకొంటున్నారు. అతని వాక్యాలకు తమ కిష్టమైన అర్థాలు ఆపాదించుకొని అతని అభిమతానికి కేవలం వ్యతిరేకమైన అర్థంలో ఉదహరించటం జరుగుతున్నది. ఇలాంటి పొరపాటు జరగకుండా ఉండాలంటే పైమార్గం ఒక్కటే శరణ్యం.

అయితే ఒక్కవ్యాసంలో ఆపని సాధ్యంకాదు. అందువల్ల ఈ వాదాన్ని అర్థంచేసుకోవటానికి అత్యంతముఖ్యములైన విషయాలనుమాత్రమే ఇచ్చట ఇస్తున్నాను.

## జీవిత చరిత్ర

ప్లేటో క్రీస్తుపూర్వం 428 లో జన్మించాడు. వాసస్థానం సంస్కృతి సంపన్నమైన ఏథెన్సునగరం, అతని తండ్రివైపువారు, తల్లివైపువారు తర తరాలనుండి సుప్రసిద్ధులు. పరిపాలక వర్గంలోనివారు. ఆనాటి తత్త్వవేత్త లలో ప్రథమ గణ్యుడైన సోక్రటిస్ అతనిగురువు. కేవలం గురువుమాత్రమే కాదు. సోక్రటిస్ యొక్క తత్త్వానుసంధాన విధానము, ధర్మైకదృష్టి ప్లేటో జీవితాన్ని దిద్దితీర్చాయి, అతని జీవితానికి పరమలక్ష్యమై పోయాయి. అతని రచనలన్నిటిలోను (దాదాపు) సోక్రటిస్ నే ఉత్తమోత్తమ తత్త్వార్థ ప్రతి పాదకునిగా చిత్రించాడు.

నాటి ప్రజాస్వామిక ప్రభుత్వం అతనిగురువైన సోక్రటిస్ కు అన్యా యంగా మరణశిక్ష విధించింది. సోక్రటిస్ నిజంగా ఆశిక్ష తప్పించుకొని పారిపోవటానికి అవకాశం వున్నది. అయినా, తనదేశానికి, ధర్మానికి అప చారంచేసి నట్లవుతుందన్న భావంతో అతడు ఆ ఘోరశిక్షను తల ఒగ్గాడు సరిగా ఆ మరణశిక్షా సమయంలో వ్యాధిగ్రస్తుడై ప్లేటో గురువును సంద ర్శింప లేకపోయాడు. అన్యాయంగా గురువును ప్రభుత్వంచంపిన తరువాత ప్లేటో ఏథెన్సు నగరంనుంచి మెగారానగరానికి వెళ్ళాడు. అక్కడనుంచి అనతికాలంలోనే బయలుదేరి కొన్నిసంవత్సరాలు పాటుగా ఇటలీ, సిరనీ, సిసిలీ, ఈజిప్టుదేశాలలో సంచారంచేశాడు. అటుమీదట ఏథెన్సుకు తిరిగి వచ్చి అక్కడ విశ్వవిద్యాలయం నెలకొల్పాడు. యూరప్ లో తరువాత బయలుదేరిన విశ్వవిద్యాలయాలకు, నిష్పాక్షిక పరిశోధనలకు ఇదేమార్గ దర్శకమైనది. ప్లేటోకు సమకాలికుడు, వయోవృద్ధుడయిన ఐసోక్రాటిస్ ఒక పాఠశాలను నెలకొల్పి యువకులకు రాజకీయశిక్షణ ఇస్తూ వచ్చాడు. ప్లేటో తన విశ్వవిద్యాలయంలో రాజకీయ కార్యకలాపాలకు మూలము కేవలం శాస్త్రమేనని, శాస్త్రార్థాలను బోధిస్తూ వచ్చాడు. తరువాత 20 సంవత్సరాలు విశ్వవిద్యాలయ నిర్వాహకుడుగావిస్తూ విద్యార్థులకు విద్యా దానంచేస్తూ వచ్చాడు. అతడు ధర్మాన్నిగూర్చి, తాత్త్విక సమస్యలను గూర్చి, గణితశాస్త్రార్థాలనుగూర్చి విద్యార్థులతో చర్చిస్తూ గడిపాడు.

60 వ ఏట తనరాజకీయ లక్ష్యాలన్నిటిని అమలు పరచటానికి అవకాశం దొరికినట్లుగా అతనికి కనిపించింది. దానికోసమై ప్లేటో ప్రయత్నించాడు. కాని అనతికాలంలోనే అవకాశాలన్నీ విషమ పరిస్థితులవల్ల వ్యర్థమైపోయాయి. తిరిగి ప్లేటో తన విశ్వవిద్యాలయానికి చేరుకొని తుది గడియవరకు అక్కడే గడపి క్రీ. పూ. 348 లో అస్తమించాడు.

ప్లేటో ప్రతిభ అనన్యం. అతని ప్రతిభాజ్యోతి ప్రకాశింపజేయని అర్థంలేదు. జ్ఞానస్వరూపం, సృష్టిక్రమం, జగత్తత్వం, ధర్మస్వరూపం, మానవజీవితాదర్శం, పురుషార్థాలు, భాషాతత్త్వం, ప్రణయరహస్యం, కళాతత్త్వం, జాతీయవిద్యావిధానం, రాజ్యాంగం, పరిపాలనా విధానం, పౌరధర్మం, గణితశాస్త్రం, జ్యోతిశ్శాస్త్రం, రేఖాగణితం, సంఖ్యాతత్త్వం, జీవశాస్త్రం, వైద్యశాస్త్రం, ఒకటేమిటి, పరామృష్టంకానివిషయం లేదంటే అతిశయోక్తిలేదు. అయితే విచిత్రం మరొకటి ఉంది. ఇన్ని శాఖలలోను అతడు ప్రతిపాదించే అర్థాలు స్థూలాతి స్థూలములు కావు. సూక్ష్మాతి సూక్ష్మాంశాలెన్నో చర్చితము లవుతాయి. లేదా కనీసం స్పృష్టాలవుతాయి. ఆ రచనలు చదువుతుంటే పాఠకునకు దిగ్భ్రమ కలుగుతుంటుంది. 2400 సంవత్సరాలక్రితం ఈనాటి పాఠకుని ఎలా ఊహించగలిగాడా అని విస్మయం కలుగుతుంది.

ప్లేటో రచనలో మరొక ప్రత్యేకత ఉంది. అతని రచనలన్నీ సంభాషణ రూపంలో ఉన్నాయి. వివిధ వాదాలు ఖండన మండనలకు పాల్పడుతాయి. అయినా ప్లేటో సాధారణంగా ఎక్కడా ఇదమిత్థమని సిద్ధాంతీకరించడు. ఆ నిర్ణయం, నిర్వచనం పాఠకునికే వదిలి వేస్తాడు. తన రచనలను పాఠకులలోని జిజ్ఞాస ప్రజ్వరిల్లటానికి ఇంధనాలుగా చేశాడు. ఎంతగంభీర విషయం చర్చించబడుతున్నా క్లేశం, తర్కకర్కశత్వం ఉండవు. ఒక మధుర కావ్యాన్ని చదువుతున్నట్లుగా ఉంటుంది.

అట్లని అతని రచనలు లోతుపాతులు తడవవని అనటానికి వీలులేదు అవి దివ్యతారలులాగా మెరిసిపోతుంటాయి. యుగయుగాలనుండి సూర్య చంద్రాదులను చూస్తూనే ఉన్నాము. అనుదినం అందరమూ చూస్తున్న

యీ సూర్య చంద్రాదులు ఒక్కొక్కనిలో అతని సంస్కారబలాన్ని పట్టి ఒక్కొక్క మధుర భావాన్ని రేకెత్తిస్తున్నారు. సూర్య చంద్రాదికాన్ని ఎందరు కవులు వర్ణించలేదు ? వీరందరికీ ఉద్బోధకములు అవే కదా ? అయినా ఆ వర్ణనలలో ఎంత అనన్యత్వం, ఎంత వైవిధ్యం గోచరిస్తుంటుంది?

అలాంటివే ప్లేటో రచనలు; దివ్యతారలు, చ్యుతిలేని బింబాలు, నిత్యోద్బోధకాలు. అతని ప్రభావం సోకని పాశ్చాత్య దార్శనికుడు ఒక డైనా లేడనటంలో అతిశయోక్తి యేమాత్రం లేదు. భారతీయ దార్శనికు లకు ఉపనిషత్తులు ఎట్టివో, పాశ్చాత్యదార్శనికులకు ప్లేటో రచనలు అట్టివి. ప్లేటో తరువాత వెలువడిన తాత్త్వికసిద్ధాంతాలన్నీ అతని రచనలకు టిప్పణీకలే నని ప్రొఫెసరు వైట్ హెడ్ అభిప్రాయం. ఇది అతిశయోక్తి అయినా కొంతలో కొంతైనా సత్యములేకపోలేదని అభిజ్ఞులకు పొడకట్టకమానదు.

అయితే ప్లేటో సిద్ధాంతాన్ని యథాతథంగా అర్థంచేసుకోవాలంటే చాలకష్టం. ఎందువల్లనంటే పైని చెప్పినట్లుగా అతని రచనలు పాఠకునిలో అనంతభావప్రపంచాన్ని రేకెత్తిస్తుంటాయి. యథార్థంగా ఎంతవరకు ఆ భావాలను ప్లేటోరచనలు స్వతః ప్రతిపాదిస్తున్నవో, ఎంతవరకు పాఠకుని బుద్ధి ప్రతిపాదిస్తున్నదో విభజించటం కష్టసాధ్యం. ఈ విభాగం స్పష్టంగా జరిగితేనేగాని ప్లేటో సిద్ధాంతాలను యథాతథంగా అర్థంచేసుకోటానిక వీలు లేదు. నిజానికి ఎంతోమంది వ్యాఖ్యాతలు తమ అభిప్రాయాలు వాటికాపా దించి, దానికి ప్లేటోను ప్రశంసించటం జరిగింది.

ప్లేటోనుగూర్చి ఇలా చెప్పటంవల్ల అతడు మానవమాత్రుడు కాదనీ, కేవలం ఈశ్వరుడే అవతరించి కొత్తగా పూర్వమున్న సిద్ధాంతాలతో సంబంధంలేకుండా యీ విశిష్ట సిద్ధాంతాలను సృష్టించాడని అర్థంచేసుకో రాదు. అతని ప్రతిభ అనన్యం. అతడుకూడా తనకు పూర్వమున్న గ్రీక్ తత్త్వవేత్తలు ప్రతిపాదించిన అర్థాలవల్ల ప్రతిబుద్ధుడయ్యాడు. పైథాగరస్ పర్మనైడ్సు, హిరాక్లిటస్, సోక్రటిస్‌ల ప్రభావం అతని సిద్ధాంతాల్లో అనల్పంగా కనిపిస్తుంది. పైథాగరస్ నుంచి అతడు ఆత్మనిత్యత్వము, జన్మ

పరంపర, పారలౌకికత్వం, గుహాదృష్టాంతము, గణితశాస్త్రాభిమానం మొదలైనవి స్వీకరించాడు. 'యాథార్థ్యం నిత్యము, కాలానికి అతీతము. పరిణామము కేవలం ప్రాతిభాసికము' అన్న భావాలు పర్మనైడ్సునుంచి స్వీకరించాడు. భౌతికప్రపంచంలో ఏదీ నిత్యంకాదన్న పర్మనైడ్సు సిద్ధాంతంతో జోడించటంవల్ల యథార్థజ్ఞానం ఇంద్రియాలవల్ల లభ్యంకాదనీ, కేవలం బుద్ధివల్లనే లభ్యమౌతుందనీ ప్లేటో ప్రతిపాదించటం జరిగింది. సోక్రటిస్ ప్రభావంవల్లనే బహుశః అతడు ధార్మికసమస్యలలో ఎక్కువ నిమగ్నుడు కావటమేమి, ప్రయోజనదృష్టితో జగత్తత్త్వ నిరూపణకు ప్రయత్నించటమేమి జరిగి ఉంటుంది.

ఏది ఎలాఉన్నా ప్లేటో సిద్ధాంతాలను మొత్తముమీద ఆరుభాగాలుగా విభజించవచ్చును. 1. జ్ఞానస్వరూపం, 2. ఆత్మనిత్యత్వం, 3. సృష్టి విధానం, 4. ధర్మం, 5. ఆదర్శరాజ్యం, 6. కళలతత్త్వం. జ్ఞానస్వరూపాన్నిగూర్చి ఏ ఒకచోట ఇదమిత్థమని అతడు చెప్పకపోయినా థియటీటస్‌లోను, రిపబ్లిక్‌లోని అయిదారు ఏడు ప్రకరణాలలోను, ఇంకా ఇతర రచనలలోను వ్రాసిన దానినిబట్టి కొంత ఊహించుకోవచ్చును. దీనినిబట్టి జ్ఞాన విషయంలో అతని మతాన్ని ఈ విధంగా చెప్పవచ్చును.

కన్ను, చెవి, ముక్కు, చర్మము నాలుక అన్న పంచేంద్రియాలతో ఈ జగత్తును తెలుసుకొంటున్నాము. సూర్యచంద్రాదులను చూస్తున్నాము. పక్షుల కలకలారావాలు వింటున్నాము. పుష్పాదుల గంధం ఆఘ్రాణిస్తున్నాము. చందనాదుల శైత్యాది స్పర్శజ్ఞానం పొందుతున్నాము. శర్కరాదుల మాధుర్యాదికం అనుభవిస్తున్నాము. ఈ యింద్రియాలే లేకపోతే మనకు జ్ఞానమెక్కడిది? వీనివల్లనే జీవితం చరితార్థ మౌతున్నదని భావిస్తున్నారు.

ఇంద్రియాలవల్ల చరితార్థత కలుగుతున్నదో లేదో అలా ఉంచుదాము. వీనివల్ల కలుగుతున్న దొక్కటే జ్ఞానమనిపించవచ్చును. కాని కొంచెం పారజూస్తే అది యథార్థంకాదని తేలిపోతుంది. అక్షరాలు రాని వారికి పుస్తకం చేతికిస్తా మనుకోండి. వారు ఆ పుస్తకం ఆమూలాగ్రం

విశేషమే అని వాదించవచ్చును. పైగా ఇంద్రియదోషం ఎక్కడ ప్రారంభిస్తున్నది, ఎక్కడ అంతమౌతున్నది అన్న ప్రశ్నకు సమాధానం శాస్త్రీయంగా తేలదు.

ఈవిధంగా ఇంద్రియజ్ఞానం వ్యక్తికమూ, దుష్టమూ అవుతున్నది. పైగా మరొక దోషంగూడా ఇందులో ఉన్నది. దృష్టాంతం ఏనుగునే తీసుకొందాము. ఈ యేనుగు కొండకన్నా చిన్నది. లేడికన్నా పెద్దది. ఒకే ఏనుగు ఇటుచిన్నదిగాను కనిపిస్తున్నది, అటు పెద్దదిగాను కనిపిస్తున్నది. అంటే మనకు కనిపించే ఏనుగు స్థూలత్వం సాపేక్ష మవుతున్నది. అంటే ఒక దానినిబట్టి మరొకదానిని తెలియటం కాని, కొలవటం కాని జరుగుతున్నది.

ఉదాహరణకు గుడ్డతాను తీసుకొందాము. ఆ తాను పొడువెంతో తేల్చుకోవాలంటే ఏమి చేస్తున్నాము? గజంబద్దతో కొలుస్తున్నాము. గజంబద్ద సరియైనది అయితే సరియైన కొలతే వస్తుంది. సరియైన బద్ద కాకపోతే సరియైన కొలత రాదు. బద్ద ననుసరించి కొలత ఉంటున్నది. అంటే తానుకొలత సాపేక్ష మన్నమాట. తానుకొలత సాపేక్షమైనట్లే గజంబద్ద కొలతకూడా సాపేక్షమే.

ఈవిధంగా మనకు పంచేంద్రియాలద్వారా కలుగుతున్న జ్ఞానమంతా సాపేక్షంగా ఉంది. ఇలాంటి సాపేక్షజ్ఞానం యథార్థం అవుతుంది? యథార్థజ్ఞానం అభిలషించేవాడు ఇలాంటి పొరపాటు రాకుండా చూడాలి. అంటే వ్యక్తికము, సాపేక్షము అయిన ఇంద్రియజన్యజ్ఞానం యథార్థజ్ఞానంగా పరిగణించటానికి వీలు లేదు.

ఈమాట అనగానే యం. యస్‌సీలు, డి. యస్‌సీలు, "మీ గుర్రాన్ని కాస్త కట్టివేయండి. జగత్తులో ప్రతిదీ సాపేక్షమే. ప్రతిదీ పరిణామి. ఈ సాపేక్షత్వం, యీ పరిణామిత్వం, మాత్రమే యథార్థం. అందువల్ల పరిణామరహితమూ, నిరపేక్షమూఅయిన పారమార్థిక(*Absclute*) జ్ఞానం అసంభవం. అలాంటిది సాధ్యంకాదు, యథార్థంఅంతకన్నా కాదు

అసలు అలాంటి పారమార్థికజ్ఞానం మీ స్వకపోలకల్పిత జగత్తులో లభించవలసిందేతప్ప మనం నివసిస్తున్న జగత్తులో లభించదు,'' అనవచ్చును.

వీరు కోరుతున్నట్లే ఆగుదాము. పసుగెత్తటం దేనికి? బోర్లపడటం దేనికి? మనకు కావలసింది యాథార్థ్యం. వీరు చెప్పేదానిలో యాథార్థ్యం ఉంటే తప్పకుండా స్వీకరించాలి. అయితే వీరివాదం ప్రకారం ప్రతిదీ మారుతుంటుంది. అందువల్ల పారమార్థికజ్ఞానం అసంభవం. ఈ వాదాన్ని అంగీకరిస్తే ఏ రేవులో తేలుతామో చూదాము.

మార్పు ధారావాహికం, నిరంతరం మార్పు జరుగుతూనే ఉంటుంది. ఆ పక్షంలో తెల్లనిది కానిది తెల్లనిదై, ఆ తెల్లనిది నల్లనిదిగా ఇంకా మారుతూనే ఉంటుంది. అంతేకాని ఎప్పుడూ స్థిమితంగా ఒకేరంగు ఉండదు. అదే నిజమైతే తెలుపనో, నలుపనో మరొక రంగనో నిర్దిష్టంగా చెప్పటానికి ఎలా వీలవుతుంది? ఇలాగే వీక్షణశ్రవణాదులుకూడాగదా! కాక యీ వీక్షణశ్రవణాద క్రియలు ఆగిపోవటం జరుగుతుందా? లేదు. ఎందుకంటే అన్నీ నిరంతరం మార్పు చెందేవేగా? అయినప్పుడు చూస్తున్నారు అని కాని, చూడటంలేదు అని కాని చెప్పటానికి వీలులేదు. ఇలాగే ప్రత్యక్షజ్ఞానమని కాని, అప్రత్యక్షజ్ఞానమని కాని చెప్పటానికి వీలులేదు.

ఏదీ స్థిరంగా, పరిణామరహితంగా లేదు. అంటే దేనినిగూర్చి ఏమి చెప్పినా ఒప్పుకోవాలి. ఒక వస్తువు ఇలా ఉన్నదని కాని, లేక ఇలా లేదని కాని, ఇలా మారుతున్నదని కాని అంటూ మనుకోండి. ఈ వాక్యంలోని "ఇలా" అనే మాటలో మార్పు లేదే. కాబట్టి పరిణామ వాదులకు తమ అభిప్రాయాలను వెల్లడించుకోటానికి ఇంతవరకూ తగినమాటలుకూడా లేవు. ఇకకొత్తభాష సృష్టించుకోవాలి.

ఈ పర్యావలోకనంతో తేలిన విషయాలను మరొకసారి జ్ఞాపకం చేసుకొందాము. I ప్రత్యక్షజ్ఞానం ఒక్కటిమాత్రమే ప్రమ అనటానికి వీలులేదు. ఎందుకంటే (౧) స్మృతిజన్యజ్ఞానం జ్ఞానం కాకపోతున్నది. (౨) ప్రత్యక్షమే ప్రమ అయితే వీక్షణశ్రవణాదులవల్ల అన్యభాషా గ్రంథాలు, అన్యభాషాభాషితాలు తెలియాలి. (3) గోత్వసౌందరా

అసలు అలాంటి పారమార్థికజ్ఞానం మీ స్వకపోలకల్పిత జగత్తులో లభించవలసిందేతప్ప మనం నివసిస్తున్న జగత్తులో లభించదు," అనవచ్చును.

మీరు కోరుతున్నట్లే ఆగుదాము. పరుగెత్తటందేనికి? బోర్లపడటందేనికి? మనకు కావలసింది యాథార్థ్యం. మీరు చెప్పేదానిలో యాథార్థ్యం ఉంటే తప్పకుండా స్వీకరించాలి. అయితే మీరివాదం ప్రకారం ప్రతిదీ మారుతుంటుంది. అందువల్ల పారమార్థికజ్ఞానం అసంభవం. ఈ వాదాన్ని అంగీకరిస్తే ఏ రేవులో తేలుతామో చూదాము.

మార్పు ధారావాహికం, నిరంతరం మార్పు జరుగుతూనే ఉంటుంది. ఆ పక్షంలో తెల్లనిది కానిది తెల్లనిదై, ఆ తెల్లనిది నల్లనిదిగా ఇంకా మారుతూనే ఉంటుంది. అంతేకాని ఎప్పుడూ స్థిమితంగా ఒకేరంగు ఉండదు. అదే నిజమైతే తెలుపనో, నలుపనో మరొక రంగనో నిర్దిష్టంగా చెప్పటానికి ఎలా వీలవుతుంది? ఇలాగే వీక్షణశ్రవణాదులుకూడాగదా! కాక యీ వీక్షణశ్రవణాద క్రియలు ఆగిపోవటం జరుగుతుందా? లేదు. ఎందుకంటే అన్నీ నిరంతరం మార్పు చెందేవేగా? అయినప్పుడు చూస్తున్నారు అని కాని, చూడటంలేదు అని కాని చెప్పటానికి వీలులేదు. ఇలాగే ప్రత్యక్షజ్ఞానమని కాని, అప్రత్యక్షజ్ఞానమని కాని చెప్పటానికి వీలులేదు.

ఏదీ స్థిరంగా, పరిణామరహితంగా లేదు. అంటే దేనినిగూర్చి ఏమి చెప్పినా ఒప్పుకోవాలి. ఒక వస్తువు ఇలా ఉన్నదని కాని, లేక ఇలా లేదని కాని, ఇలా మారుతున్నదని కాని అంటూ మనుకోండి. ఈ వాక్యంలోని "ఇలా" అనే మాటలో మార్పు లేదే. కాబట్టి పరిణామ వాదులకు తమ అభిప్రాయాలను వెల్లడించుకోటానికి ఇంతవరకూ తగినమాటలుకూడా లేవు. ఇకకొత్తభాష సృష్టించుకోవాలి.

ఈ పర్యావలోకనంతో తేలిన విషయాలను మరొకసారి జ్ఞాపకం చేసుకొందాము. I ప్రత్యక్షజ్ఞానం ఒక్కటిమాత్రమే ప్రమ అనటానికి వీలులేదు. ఎందుకంటే (౧) స్మృతిజన్యజ్ఞానం జ్ఞానం కాకపోతున్నది. (౨) ప్రత్యక్షమే ప్రమ అయితే వీక్షణశ్రవణాదులవల్ల అన్యభాషా గ్రంథాలు, అన్యభాషాభాషితాలు తెలియాలి. (3) గోత్వసౌందరా

విశేషమే అని వాదించవచ్చును. పైగా ఇంద్రియదోషం ఎక్కడ ప్రారంభిస్తున్నది, ఎక్కడ అంతమౌతున్నది అన్న ప్రశ్నకు సమాధానం శాస్త్రీయంగా తేలదు.

ఈవిధంగా ఇంద్రియజ్ఞానం వ్యక్తికమూ, దుష్టమూ అవుతున్నది. పైగా మరొక దోషంగూడా ఇందులో ఉన్నది. దృష్టాంతం ఏనుగునే తీసుకొందాము. ఈ యేనుగు కొండకన్నా చిన్నది. లేడికన్నా పెద్దది. ఒకే ఏనుగు ఇటుచిన్నదిగాను కనిపిస్తున్నది, అటుపెద్దదిగాను కనిపిస్తున్నది. అంటే మనకు కనిపించే ఏనుగు స్థూలత్వం సాపేక్ష మవుతున్నది. అంటే ఒక దానినిబట్టి మరొకదానిని తెలియటం కాని, కొలవటం కాని జరుగుతున్నది.

ఉదాహరణకు గుడ్డతాను తీసుకొందాము. ఆ తాను పొడువెంతో తేల్చుకోవాలంటే ఏమి చేస్తున్నాము? గజంబద్దతో కొలుస్తున్నాము. గజంబద్ద సరియైనది అయితే సరియైన కొలతే వస్తుంది. సరియైన బద్ద కాకపోతే సరియైన కొలత రాదు. బద్ద ననుసరించి కొలత ఉంటున్నది. అంటే తానుకొలత సాపేక్ష మన్నమాట. తానుకొలత సాపేక్షమైనట్లే గజంబద్ద కొలతకూడా సాపేక్షమే.

ఈవిధంగా మనకు పంచేంద్రియాలద్వారా కలుగుతున్న జ్ఞానమంతా సాపేక్షంగా ఉంది. ఇలాంటి సాపేక్షజ్ఞానం యథార్థం [redacted] అవుతుంది? యథార్థజ్ఞానం అభిలషించేవాడు ఇలాంటి పొరపాటు రాకుండా చూడాలి. అంటే వ్యక్తికము, సాపేక్షము అయిన ఇంద్రియజన్యజ్ఞానం యథార్థజ్ఞానంగా పరిగణించటానికి వీలులేదు.

ఈమాట అనగానే యం. యస్ సీలు, డి. యస్ సీలు, "మీ గుర్రాన్ని కాస్త కట్టివేయండి. జగత్తులో ప్రతిదీ సాపేక్షమే. ప్రతిదీ పరిణామి. ఈ సాపేక్షత్వం, యీ పరిణామిత్వం, మాత్రమే యథార్థం. అందువల్ల పరిణామరహితమూ, నిరపేక్షమూఅయిన పారమార్థిక (*Absolute*) జ్ఞానం అసంభవం. అలాంటిది సాధ్యం కాదు, యథార్థంఅంతకన్నా కాదు

సామాన్యజ్ఞానం యథార్థజ్ఞానం కాకపోవాలి. (౪) కేవలం ప్రత్యక్షమే యథార్థజ్ఞానమైతే భ్రమకు తావులేకపోవాలి. (౫) తద్ద్వారా జ్ఞానవిషయంలో గురుశిష్యభేదంకాని, మనుష్యపక్ష్యాది తారతమ్యంకాని లేక అందరూ, అన్నీ ప్రామాణికులూ ప్రమాణికాలూ కావాలి. (౬)ఉన్మాదాద్యవస్థలందు కలుగుతున్నజ్ఞానం యథార్థం కావాలి.

II కనీసం ప్రత్యక్షంకూడా ప్రమ అని అనటానికైనా వీలులేదు. ఎందుకంటే ఇంద్రియజన్య జ్ఞానమంతా సాపేక్షం, వ్యక్తికం. సాపేక్షము, వ్యక్తికము అయినది యథార్థజ్ఞానం కాజాలదు.

## ప్రమ

ప్రత్యక్షం ప్రమ కాదు. సరే, మరి ఏది యథార్థజ్ఞానం ? అసలు యథార్థజ్ఞానం అనేది ఒకటి ఉన్నదా ? ఉంటే దానిలక్షణ మేమిటి ? అలాంటిది మానవునకు సాధ్యమా ? ఇలాంటి ప్రశ్నలు వస్తాయి.

ఒకడు ఎరుగును అంటున్నాము అంటే, ఏదో ఒకటి ఎరిగి ఉండాలి. ఆ ఏదోఒకటి ఉన్నదే అయిఉండాలి. లేనిదానిని ఎరగటం అసంభవం. పూర్ణంగా ఉన్నదానిని పూర్తిగా తెలియటానికి వీలున్నది. పూర్తిగా లేనిదానిని అసలు తెలియటానికే వీలులేదు. ఉన్నదానిని సత్ అనీ, లేనిదానిని అసత్ అనీ అందాము. అటు సత్తు, ఇటు అసత్తు కానిది ఒకటి ఉంటే అది యీరెంటిమధ్య ఉంటుంది. అలాంటి దానిని సదసద్విలక్షణ మందాము.

సత్తునకు సంబంధించినది జ్ఞానం. లేనిదానికి సంబంధించినది అజ్ఞానం. సదసద్విలక్షణానికి సంబంధించినది జ్ఞానమూ కాదు, అజ్ఞానమూ కాదు. ఈ రెంటికంటె విలక్షణం. దానిని అభిప్రాయ మందాము. అయితే యీ అభిప్రాయమూ, జ్ఞానమూ ఒకటి కావు. అభిప్రాయానికి విషయం ఒకటి; జ్ఞానానికి విషయం మరొకటి. అభిప్రాయానికి విషయం సదసద్విలక్షణ పదార్థం. జ్ఞానానికి విషయం సత్పదార్థం. అజ్ఞానానికి విషయం అసత్పదార్థం. అందువల్ల అభిప్రాయం జ్ఞానంకంటె న్యూనం. అజ్ఞానంకంటె

అధికం. అజ్ఞానం కటికిచీకటి అయితే, అభిప్రాయం గుడ్డివెలుగు; జ్ఞానం నిర్మలజ్యోతి. ఇంతకూ సదసద్విలక్షణపదార్థం ఒకటి ఉన్నదా? అంటే అటు ఉన్నదీకాక, ఇటు లేనిదీకాక. యీ రెంటికీ మధ్యస్థమైన వస్తువు ఉన్నదా అనే ప్రశ్న రావటం సహజం

ఈ సదసద్విలక్షణమైన వస్తువులకోసం ఎక్కడకోపోయి వెదక నవసరంలేదు. పంచేంద్రియాలకు గోచరించే వ్యక్తి ప్రపంచమంతా యీసద సద్విలక్షణ పదార్థమే. ఇందులో ఆశ్చర్యపడవలసిన పనిలేదు. లౌకికమైన ఏ విషయాన్ని తీసికొన్నా యీ విషయం స్పష్టమౌతుంది. దృష్టాంతానికి ఏనుగునే తీసుకుందాము. లేడికంటె ఏనుగు పెద్దది. పర్వతంకంటె చిన్నది. కాబట్టి ఏనుగు ఒకదృష్టితో పెద్దది. ఆ ఏనుగే మరొక దృష్టితో చిన్నది. ఇలా ఒకే ఏనుగులో స్థూలత్వం, అస్థూలత్వం అన్న కేవల పరస్పర విరుద్ధ గుణాలు కనిపిస్తున్నవి. అంటే ఏనుగు సదసద్విలక్షణమౌతున్నది. ఇలాగే తతిమ్మా లౌకిక విషయాలు. పంచేంద్రియ గోచరములైన వ్యక్తులన్నీ సద సద్విలక్షణాలే. అంటే వీటినిగూర్చి మనకు కలిగేది అభిప్రాయం మాత్రమే కాని జ్ఞానం మాత్రంకాదు.

రమణీయార్థాలు అనేకం, ధార్మికవిషయాలు అనేకం అని ఈవిధంగా నానాత్వం చూచేవారివి అభిప్రాయాలేకాని జ్ఞానం కాదు. రమణీయకం ఒకటే. ధర్మం ఒకటే, సత్యం ఒకటే అని యీ విధంగా ఏకత్వం చూచే వారే జ్ఞానిశబ్దవాచ్యులు. అంతేకాని వ్యక్తులను చూచేవారు అభి ప్రాయాలున్న వారేకాని జ్ఞానులు కాదు.

ఈ విధంగా జ్ఞానవిషయం పరిణామరహితం, నిరపేక్షం, అలౌకికం, పంచేంద్రియాగోచరం అయిన కేవలసత్పదార్థం. అయితే ఈ సత్పదార్థ మేమిటి? దాని లక్షణాలేమిటి? ఈ సత్పదార్థం ఒకటా, రెండా? అనేకాలా? ఈ సత్పదార్థానికీ, పంచేంద్రియాలకు గోచరిస్తున్న భౌతిక ప్రపంచానికీ సంబంధమేమిటి? ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పుకోవాలి.

అధికం. అజ్ఞానం కటికచీకటి అయితే, అభిప్రాయం గ్రుడ్డివెలుగు; జ్ఞానం నిర్మలజ్యోతి. ఇంతకూ సదసద్విలక్షణపదార్థం ఒకటి ఉన్నదా? అంటే అటు ఉన్నదీకాక, ఇటు లేనిదీకాక. యీ రెంటికీ మధ్యస్థమైన వస్తువు ఉన్నదా అనే ప్రశ్న రావటం సహజం

ఈ సదసద్విలక్షణమైన వస్తువులకోసం ఎక్కడకోపోయి వెదకనవసరంలేదు. పంచేంద్రియాలకు గోచరించే వ్యక్తి ప్రపంచమంతా యీసదసద్విలక్షణ పదార్థమే. ఇందులో ఆశ్చర్యపడవలసిన పనిలేదు. లౌకికమైన ఏ విషయాన్ని తీసికొన్నా యీ విషయం స్పష్టమౌతుంది. దృష్టాంతానికి ఏనుగునే తీసుకుందాము. లేడికంటె ఏనుగు పెద్దది. పర్వతంకంటె చిన్నది. కాబట్టి ఏనుగు ఒకదృష్టితో పెద్దది. ఆ ఏనుగే మరొక దృష్టితో చిన్నది. ఇలా ఒకే ఏనుగులో స్థూలత్వం, అస్థూలత్వం అన్న కేవల పరస్పర విరుద్ధ గుణాలు కనిపిస్తున్నవి. అంటే ఏనుగు సదసద్విలక్షణమౌతున్నది. ఇలాగే తతిమ్మా లౌకిక విషయాలు. పంచేంద్రియ గోచరములైన వ్యక్తులన్నీ సదసద్విలక్షణాలే. అంటే వీటినిగూర్చి మనకు కలిగేది అభిప్రాయం మాత్రమే కాని జ్ఞానం మాత్రంకాదు.

రమణీయార్థాలు అనేకం, ధార్మికవిషయాలు అనేకం అని ఈవిధంగా నానాత్వం చూచేవారివి అభిప్రాయాలేకాని జ్ఞానం కాదు. రమణీయకం ఒకటే. ధర్మం ఒకటే, సత్యం ఒకటే అని యీ విధంగా ఏకత్వం చూచేవారే జ్ఞానిశబ్దవాచ్యులు. అంతేకాని వ్యక్తులను చూచేవారు అభిప్రాయాలున్న వారేకాని జ్ఞానులు కాదు.

ఈ విధంగా జ్ఞానవిషయం పరిణామరహితం, నిరపేక్షం, అలౌకికం, పంచేంద్రియాగోచరం అయిన కేవలసత్పదార్థం. అయితే ఈ సత్పదార్థమేమిటి? దాని లక్షణాలేమిటి? ఈ సత్పదార్థం ఒకటా, రెండా? అనేకాలా? ఈ సత్పదార్థానికీ, పంచేంద్రియాలకు గోచరిస్తున్న భౌతిక ప్రపంచానికీ సంబంధమేమిటి? ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పకోవాలి.

సామాన్యజ్ఞానం యథార్థజ్ఞానం కాకపోవాలి. (४) కేవలం ప్రత్యక్షమే యథార్థజ్ఞానమైతే భ్రమకు తావులేకపోవాలి. (५) తద్ద్వారా జ్ఞానవిషయంలో గురుశిష్యభేదంకాని, మనుష్యపక్ష్యాది తారతమ్యంకాని లేక అందరూ, అన్నీ ప్రామాణికులూ ప్రమాణికాలూ కావాలి. (६)ఉన్మాదావ్యవస్థలందు కలుగుతున్నజ్ఞానం యథార్థం కావాలి.

II కనీసం ప్రత్యక్షంకూడా ప్రమ అని అనటానికైనా వీలులేదు. ఎందుకంటే ఇంద్రియజన్య జ్ఞానమంతా సాపేక్షం, వ్యక్తికం. సాపేక్షము, వ్యక్తికము అయినది యథార్థజ్ఞానం కాజాలదు.

## ప్రమ

ప్రత్యక్షం ప్రమకాదు. సరే, మరి ఏది యథార్థజ్ఞానం? అసలు యథార్థజ్ఞానం అనేది ఒకటి ఉన్నదా? ఉంటే దానిలక్షణ మేమిటి? అలాంటిది మానవునకు సాధ్యమా? ఇలాంటి ప్రశ్నలు వస్తాయి.

ఒకడు ఎరుగును అంటున్నాము అంటే, ఏదో ఒకటి ఎరిగి ఉండాలి. ఆ ఏదోఒకటి ఉన్నదే అయిఉండాలి. లేనిదానిని ఎరగటం అసంభవం. పూర్ణంగా ఉన్నదానిని పూర్తిగా తెలియటానికి వీలున్నది. పూర్తిగా లేనిదానిని అసలు తెలియటానికి వీలులేదు. ఉన్నదానిని సత్ అనీ, లేనిదానిని అసత్ అనీ అందాము. అటు సత్తు, ఇటు అసత్తు కానిది ఒకటి ఉంటే అది యీ రెంటిమధ్య ఉంటుంది. అలాంటి దానిని సదసద్విలక్షణ మందాము.

సత్తునకు సంబంధించినది జ్ఞానం. లేనిదానికి సంబంధించినది అజ్ఞానం. సదసద్విలక్షణానికి సంబంధించినది జ్ఞానమూ కాదు, అజ్ఞానమూ కాదు. ఈ రెంటికంటె విలక్షణం. దానిని అభిప్రాయ మందాము. అయితే యీ అభిప్రాయమూ, జ్ఞానమూ ఒకటి కావు. అభిప్రాయానికి విషయం ఒకటి; జ్ఞానానికి విషయం మరొకటి. అభిప్రాయానికి విషయం సదసద్విలక్షణ పదార్థం. జ్ఞానానికి విషయం సత్పదార్థం. అజ్ఞానానికి విషయం అసత్పదార్థం. అందువల్ల అభిప్రాయం జ్ఞానంకంటె న్యూనం. అజ్ఞానంకంటె

## భావవాదం

ఈ విషయాలనుగూర్చి చెప్పేవాదాన్నే భావవాదం అనవచ్చు
భావం అంటే ఏమిటో, ఏ అర్థంలో ఈ శబ్దం వాడట మౌతున్నదో చె
తాను.

ఒక ఆవులమంద ఉందనుకోండి. అందులో తెల్లవి, నల్లవి, పు
బట్లవి, మైలవి, చిన్నవి, పెద్దవి అనేక వ్యక్తులుంటాయి. ప్రతి ఒకవ్య
రెండవదానికన్నా భిన్నంగా ఉన్నా, గోవు అనే పదం అన్నిటికీ వర్తిస్తు
ఆ పదంతో వాచ్యంకానిది అందులో ఒకటీ ఉండదు. అంటే వాట
టిలోను సామాన్యం లేక భావం ( Idea or Form) ఒకటి ఉంటుంది.
భౌతిక జగత్తులో శయ్యలు అనేకాలు ఉన్నాయి. అయితే శయ
భావంమాత్రం ఒకటే. అద్దంలో శయ్యాప్రతిబింబం కనిపిస్తున్నది. ఇలా
ప్రతిబింబాలు యథార్థాలు కావు. ఆభాసాలు. అలాగే వడ్రంగ
తయారుచేసిన, చేస్తున్న శయ్యలన్నీ శయ్యాభావానికి ప్రతిబింబాలు. అం
వలన వ్యక్తులయిన శయ్యలన్నీ ఆభాసాలు (Appearances) కాని యా
ర్థంకావు. ఈ వ్యక్తులైన శయ్యలు ఈశ్వరసృష్టమైన శయ్యాభావా
ప్రతులు. ఏకైకమైన శయ్యాభావాన్ని గూర్చి జ్ఞానం ఉండటానికి వీ
న్నదికాని వ్యక్తులైన శయ్యలనుగూర్చి జ్ఞానం కలగటానికి వీలులేద
వీటినిగూర్చి అభిప్రాయంమాత్రమే ఏర్పడడానికి వీలున్నది.

కాగా శయ్యాభావం యథార్థం. ఇది వ్యక్తి అయిన శయ్యాత్త
పుట్టటంలేదు. దీనితో నాశం పొందటంలేదు. ఈ భావం దేశకాలబద్ధ
కాదు. మనఃకల్పితమూ కాదు. ఇదినిత్యం. జ్ఞానానికివిషయం. ఈభావ
వ్యక్తులయిన శయ్యలకు మూలం.

అయితే యీ శయ్యాభావం ఒక్కటే భావంకాదు. భౌతికప్రప
చంలో ఎన్ని జాతులున్నాయో అన్ని భావాలున్నాయి. అంటే విభిన
వ్యక్తులలో ఎన్ని సామాన్యగుణాలు కన్పిస్తున్నవో వానిలో ఒక్కొక్క
దానికి ఒక భావం ఉన్నది. గోభావం, స్థూలత్వభావం, ఋజుత్వభావ
వక్రతాభావం ఇలా అనేకం ఉన్నాయి. ఈభావసముదాయమే ఆధ్యాత్మి

జగత్తు. ఈ జగత్తే భౌతికజగత్తుకు మూలం. భౌతిక జగత్తులో అనేక వస్తువులు ఉన్నట్లే, ఆధ్యాత్మిక జగత్తులోకూడ తారతమ్యాలున్నాయి. ఈ భావాలలో ప్రతిఒక్కటీ యథార్థము, నిత్యమూ. అయినా సత్యము, ధర్మము, రామణీయకమూ ఉత్తమాలు. ఈ మూటిలోను ధర్మం అత్యంత ఉదాత్తం.

ఈ విధంగా రెండు జగత్తు లేర్పడుతున్నవి. ఒకటి ఆధ్యాత్మికమైన భావజగత్తు. రెండు, వ్యక్తులతో కూడిన భౌతికజగత్తు. ఈ భౌతికజగత్తుకు ఆధ్యాత్మికజగత్తు మూల మన్నాము. భౌతికజగత్తు ఆభాసికము, ఆధ్యాత్మికజగత్తు యథార్థము అన్నాము. ఆ పక్షంలో ఈ రెండు జగత్తులకు సంబంధ మేమిటి? వ్యక్తి ఇంద్రియగోచరమూ, నశ్వరమూ, అభిప్రాయానికి విషయమూ కదా? భావము ఇంద్రియాలకు అగోచరము, నిత్యము, జ్ఞానానికి విషయమూ కదా. ఇలాంటి భావం తనకు కేవలం వ్యతిరేకమైన వ్యక్తికి ఎలా మూలమౌతున్నది? ఈ రెంటిమధ్య ఎలాంటి సంబంధ మున్నది?

ఇక్కడ ప్లేటో అభిమత మేమిటో స్పష్టంగా పండితులు తేల్చిచెప్ప లేకుండా ఉన్నారు. అసలు అతనికే నిశ్చితాభిప్రాయం లేదేమో ననిపిస్తుంది. ఎందుకంటే యీ విషయం వివరించవలసి వచ్చినప్పుడు అతడు ఇదమిత్థమని చెప్పకుండా వట్టి దృష్టాంతాలతో దాటవేశాడు. ఈ దృష్టాంతాలుకూడ భిన్నభిన్నంగా ఉన్నాయి రిపబ్లిక్ అనే గ్రంథంలోని ఆ రేడు అధ్యాయాలలో భావం బింబమైతే వ్యక్తి ప్రతిబింబమనీ, ఆ అధ్యాయాలలోనే మరొకచోట భావం వస్తువైతే వ్యక్తిఛాయ అనీ, ఎనిమిదో అధ్యాయం ప్రారంభంలో ఇచ్చిన గుహాదృష్టాంతాన్ని బట్టికూడ భావం వస్తువనీ, వ్యక్తి ఛాయ అనీ పేర్కొన్నాడు. పదో అధ్యాయంలో ఈ విషయమే వచ్చినపుడు ఈశ్వర సృష్టమైన శయ్యాభావం వడ్రంగి అనుకరిస్తున్నా డన్నాడు. కవిసంగతి చెప్పవలసివచ్చినపుడు అద్దంలో భౌతిక వస్తువులు ప్రతిబింబిస్తున్నట్లే అతని రచనలలో అన్ని వస్తువులూ ప్రతిబింబిస్తున్న వన్నాడు. ఆ తరువాతనే లలిత కళలకున్న స్థానాన్ని గూర్చి చెబుతూ భావాలు

ఆయా వృత్తులవారిచే అనుకరింప బడుతున్నవి. ఈ అనుకృతాలు తిరిగి కవిచిత్రకారాదులచే అనుకరింప బడుతున్న వన్నాడు. ఆ అధ్యాయం లోనే మరొకచోట భావానికీ, వ్యక్తికీ మాతా పుత్రికల (Original and theCopy) సంబంధం చెప్పబడ్డది. ఈ విధంగా బింబప్రతిబింబభావము, వస్తుచ్ఛాయా భావము, అనుకార్యానుకృతిభావము, మాతాపుత్రికా భావము మాత్రమేకాక వ్యంగ్య వ్యంజకభావంకూడా చెప్పబడ్డది. ఎందుకంటే ధర్మము, సత్యము, రామణీయకమూ అన్న భావాలనుగూర్చి చెప్పే సందర్భంలో అభివ్యక్తి పొందటం వాని లక్షణమని ప్లేటో పేర్కొన్నాడు. మరి కొందరు ముద్రాముద్రిత భావం ప్లేటో కున్నట్లు చెబుతున్నారు. సృష్టి విధానాన్నిగూర్చి వ్రాసిన సందర్భంలో ఈశ్వరుడు భావాలను సృష్టించినట్లుగా టిమీయుస్ (Timaeus)లో ప్లేటో పేర్కొన్నాడు. ఇక్కడ సృష్టి అనే పదానికి అభివ్యక్తి అని కొందరు వ్యాఖ్యాతలు అర్థం చెబుతున్నారు

ఏది ఎలా ఉన్నా, ప్లేటో రచనలలో సాధారణంగా భావాలలో వ్యక్తులు భాగస్వామ్యం * పొందటానికి యత్నిస్తాయనీ, ఏ ఒకవ్యక్తి భావంయొక్క లక్షణాలను పూర్తిగా పొందలేకపోవటంవల్ల వ్యక్తులు అనేకాలుగా ఉంటున్నాయనీ కనిపిస్తుంది. ♦ "పర్మెనైడ్సు"లో భావ సిద్ధాంతం చర్చకు వస్తుంది. వివిధయుక్తులు చర్చితము లౌతాయి. అందులో ఏ ఒకటీ నిలవదు.

భావవాదంతో రెండు జగత్తులు ఏర్పడుతున్నవి. ఒకటి భౌతిక జగత్తు, రెండు ఆధ్యాత్మికజగత్తు. ఇలా ఏర్పడే రెండు జగత్తులలో ఒక్కొక్క దానిని ప్లేటో మళ్ళీ రెండు విభాగాలు చేస్తాడు. ఈ విధంగా మొత్తం జగత్తు నాలుగుభాగాలౌతున్నది. మొదటిది వ్యక్తి ప్రపంచం, అంటే పంచేంద్రియగోచరమైన జగత్తు. పుట్టి పెరిగి నశించే వస్తుకోటి అంతా ఈ జగత్తులోనిది. రెండవది ఇంద్రియజన్యానుభూతి ప్రపంచం. ఇంద్రియ అర్థసంయోగంవల్ల కలుగుతున్న అనుభూతిఅంతా ఇందులోకి

* Partake of or participate in

♦ Plato and Parmonides by F- M. Cornford.

వస్తుంది. మూడోది సోపాధికజగత్తు. తత్త్వవిచారంతప్ప మిగిలిన గణితాది శాస్త్ర విషయమంతా ఈ జగత్తు క్రిందికి వస్తుంది. నాలుగోది కేవలం వివేకం (Reason) జగత్తు ఇక్కడ తర్కంద్వారా మూలసూత్రం తెలిసికోవట మౌతుంది. ఈ నాలుగు జగత్తులలో పూర్వ పూర్వములకంటె ఉత్తరోత్తరాలు యథార్థతరాలు. మొదటిది ఛాయ అయితే రెండవది మణిదర్పణాదులందు కనిపించే ప్రతిబింబం. రెండవభాగం ఛాయ అయితే మూడోది ప్రతిబింబం. మూడోది ప్రతిబింబమైతే నాలుగోదిబింబం. ఈవిధముగా నాలుగోది ఒక్కటే యథార్థం. తతిమ్మావన్నీ ఆభాసాలు.

మొదటి జగత్తులో విశేషమేమీ లేదు. మూడోది నాలుగోది కొంచెం జాగ్రత్తగా అర్థంచేసుకోవాలి. మూడో జగత్తయిన మానసికప్రపంచంలో రెండవ జగత్తువల్ల లభిస్తున్న ఛాయలు ఆధారంచేసుకొని విచారం సాగుతుందంటాడు ప్లేటో. దీనికి రేఖాగణితజ్ఞుల విచారం ఉదాహరణగా ఇస్తాడు. రేఖాగణితజ్ఞులు త్రిభుజం, చతురస్రం, దీర్ఘచతురస్రం మొదలైనవి గీసి వాటిని ఆధారంచేసుకొని విచారం సాగిస్తారు. ఆ యాకృతులు కేవలం ఆధారాలుమాత్రమే. అంతేకాని వారి కవి పరమార్థాలు కావు. అలాంటి ఆకృతులను ఆధారంచేసుకొని రేఖాగణితజ్ఞులు విచారం సాగిస్తారు. అయితే యీ విచారం, ఈ ఆధారాలు, ఉపాధులు వదలి మూలసూత్రంవద్దకుపోవు. గణితశాస్త్రంకాని, మరేతత్త్వేతరశాస్త్రంకాని ఇది ఇలా ఉంటే అది అలా ఉంటుందని చెబుతుందేకాని ఇది ఇలా ఎందుకున్నదని విచారించదు. బెర్ట్రాండ్ రస్సెల్ విమర్శించినట్లుగా, "భౌతికప్రపంచంలో సరళరేఖలు లేవు. గణితశాస్త్రం సోపాధికం (Hypothetical) కాని సత్యం చెప్పాలంటే, అతీంద్రియజగత్తులో అతీంద్రియ సరళరేఖ లున్నట్లు ఉపపత్తులు చూపించాలి. ఈపని బుద్ధివల్లకాదు. కేవలం వివేకం (Reason) వల్ల జరుగుతుంది." అని ప్లేటో భావన. అంటే అతని మతం ప్రకారం వివేకమొక్కటే నిరుపాధిక సరళరేఖలు స్వర్గంలో ఉన్నవనీ, దీనినిబట్టి గణితాదిశాస్త్రార్థాలు సోపాధికాలు కాక నిరుపాధికాలనీ తేలుతుంది.

ఈవాదం జాగ్రత్తగా పరిశీలిస్తే, తత్త్వేతరశాస్త్రాలు జగత్తులోని సంఘటనలు ఎలా జరుగుతున్నాయి (How) అన్న ప్రశ్నకు సమాధానం చెబుతున్న వేకాని ఎందుకు (Why) జరుగుతున్నాయి అన్న ప్రశ్నకు సమాధానం చెప్పవంటాడు ప్లేటో. వివేక మొక్కటే ఎందుకు అన్న ప్రశ్నకు సమాధానం చెబుతుందని అతనివాదన.

ఇక నాలుగో జగత్తు. ఈజగత్తులో ఉపాధులను మూలసూత్రంగా కాక, ఉపాధులనుగానే వినియోగించుకొని తర్కంద్వారా వివేకం మూల సూత్రాభిముఖంగా పోతుంది. ఒక్కొక్క మెట్టే ఎక్కి చివరికి మేడలోకి చేరుకొంటున్నట్లుగా ఒక్కొక్క భావాన్నే అవలంబంచేసుకొని పైకి చేరుకొంటుంది. ఆ భావప్రపంచంలో వివేకం భౌతిక విషయావలంబనం అపేక్షించక ఒక భావంనుంచి మరొకభావానికి పోతుంది. ఇలా వివేకం అక్కడే విహరిస్తుంది.

ఇలా ఏర్పడుతున్న నాలుగుజగత్తులను గ్రహించటానికి అనుగుణంగా ఆత్మకు నాలుగు శక్తులున్నాయి. మొదటి జగత్తుకు అనుగుణమైనది ఇంద్రియకశక్తి. రెండోదానికి అనుగుణమైనది విశ్వాసనశక్తి (Faith). మూడోదానికి అనుగుణమైనది బుద్ధి. నాలుగోదానికి అనుగుణమైనది వివేకం. పూర్వాపూర్వాలకంటె ఉత్తరోత్తరాలు లోగడ చెప్పినట్లు యథార్థతరాలు, ఉత్తమోత్తమాలు.

ఈవిభాగాలను సుస్పష్టం చేయటానికి ప్లేటో ఈక్రింది దృష్టాంత మిచ్చాడు* :—

ఒక పర్వతగుహ. గుహాద్వారానికి ఎదురుగా గోడ. గోడకు అభిముఖులై గుహలో ఖైదీలు. వారి అవయవాలు బంధించి ఉంటాయి. అందువల్ల గోడ ముందరిభాగం, ఆ భాగంమీద ఏదైనా ఉంటే అదీ తప్ప మరేదీ కనిపించదు. వారి వెనక పెద్దఎత్తున మంట వెలుగుతూ ఉంటుంది.

* రిపబ్లిక్, 7వ అధ్యాయం.

ఖైదీలకు గోడలమీద తమ నీడలు కనిపిస్తుంటాయి. అవి కదులుతున్నట్లు ఇంకా ఏమేమో చేస్తున్నట్లు ఉంటాయి.

ఆ గుహ ప్రతిధ్వనించేదయి ఆ ప్రతిధ్వని గోడ ప్రక్కనుంచి వస్తుందేపో, అప్పుడు ఖైదీలు ఏమనుకొంటారు ? ఆ నీడలు నిజంగా కదులు తున్నవనీ, నిజంగా మాట్లాడుతున్నవనీ అనుకొంటారు. వారికి ఆ బొమ్మలే యథార్థా లనిపిస్తాయి.

ఆ ఖైదీలలో ఒకరిని బంధవిముక్తునిచేసి వెనుదిరిగి చూడమంటామేపో, వెనుకనుంచి కనిపించే ఆ తీవ్రతేజం మొదట్లో అతడు చూడలేడు. అది అతని కన్నులను మిరుమిట్లు కొలుపుతుంది. తేజస్సు వస్తున్నదిశలో మొదట ఏమీ కనిపించదు. గోడమీద అంతకుమున్ను తాను చూచిన బొమ్మలే ఆ క్షణంలో ఎక్కువ యథార్థాలుగా కనిపిస్తాయి. అందువల్ల మొదట్లో తేజోఽభిముఖంగా నడచి యాథార్థ్యం చూడటానికి ఇష్టపడక తా నంతకు ముందు చూస్తూవచ్చిన ఛాయాప్రపంచమే యథార్థ మనుకొంటాడు.

అతన్ని అంతటితో వదలక పట్టి బలవంతాన తేజోఽభిముఖంగా గుహ వెలుపలికి తీసుకువస్తామేపో; అతని కన్నులు మిరుమిట్లు కొంటాయి. మొదట్లో అంతా అంధకారబంధురంగా ఉంటుంది. తరువాత తరువాత కొంచెం అలవాటుపడతాడు. మొదట్లో నీడలు, తరువాత జలదర్పణాదు లలో కనిపించే ప్రతిబింబాలు, ఆపైని రాత్రివేళ ప్రకాశించే తారకలను చంద్రుణ్ణి పిమ్మట పగటివేళ ప్రకాశించే సూర్యుణ్ణి చూడగలుగుతాడు.

చిట్టచివరకి జలాదులందు కాకుండా నేరుగా యథాస్థానంలో సూర్యుణ్ణి చూడగలుగుతాడు. యథారూపంలో అతన్ని ధ్యానింపగలుగు తాడు. ఆ పిమ్మట సూర్యునివలననే ఋతువులు, సంవత్సరాలు కలుగు తున్నవనీ, అతడే దృశ్యప్రపంచానికి అంతకూ రక్షకుడనీ, పూర్వం గుహ భిత్తికపై కనిపించిన ఛాయాప్రపంచానికి కూడా అతడే కారణమనీ వాదిస్తాడు.

అతనికి గుహ, అక్కడ తనకు ఏర్పడిన అనుభవం, అక్కడి సహ చరుల జ్ఞానం జ్ఞప్తికి రాగానే తనలో వచ్చినమార్పునకు సంతోషిస్తూ

గుహానిబద్ధులపై జాలిపడడా? ఖైదీల జ్ఞానాన్ని జ్ఞానమంటాడా? వారి ఆదర గౌరవాలకు హర్షిస్తాడా? లేదు. అది జ్ఞానమని ఒప్పుకోడు. వారి ఆదర గౌరవాలకు తాపత్రయపడడు.

ఆ విముక్తుడు తిరిగి గుహలోనికి వెళ్లుతాడే అనుకొందాము. గుహలో మొదటినుంచీ ఉంటున్నవారికి కనిపిస్తున్నంత స్పష్టంగా, తొందరగా తిరిగి వెళ్ళిన విముక్తునికి ఛాయలు కనిపిస్తాయా? కనిపించవు. గుహలోని ఖైదీలు ఏమనుకుంటారు? వీడు విముక్తుడై పైకిపోయి ఉన్నకళ్ళు పోగొట్టుకొనివచ్చాడంటారు. అతడు వీరిని విముక్తులను చేసి తేజోభిముఖంగా కొనిరావటానికి ప్రయత్నిస్తే, వారు ఎదురు తిరుగుతారు. "నీకు కళ్ళు పోయినవి పోగా మాకళ్ళుకూడా ఎందుకు పోగొట్టుతా"వని తీవ్రంగా ప్రతిఘటిస్తారు. అతడు ఇంకా తీవ్రంగా యత్నిస్తే, అతన్ని చంపివేయను కూడా చంపివేస్తారు.

ఈ దృశ్యమాన ప్రపంచమే ఆగుహ. అందలి ఖైదీలే మానవులు. ఆ తేజస్సే సూర్యుడు. ఆ ఊర్ధ్వగమనమే ఆత్మయొక్క జ్ఞానప్రపంచాభిముఖగమనం.

ఇంతవరకు చెప్పుకొన్నదానినిబట్టి ఏమి తేలుతున్నది? మన ఇంద్రియాలతో చూస్తూ, అనుభవిస్తూ, వ్యవహరిస్తూఉన్న యీ భౌతిక ప్రపంచం యథార్థం కాదు. దీనినిగూర్చి పంచేంద్రియాలద్వారా కలుగుతున్న ప్రత్యక్షజ్ఞానం జ్ఞానం కాదు. కేవలం సత్పదార్థంమాత్రమే జ్ఞానానికి విషయం. అంతేకాని భౌతికప్రపంచం జ్ఞానానికి విషయంకాదు. జ్ఞాన విషయం పరిణామి కాదు. కేవలం సత్పదార్థం. కాబట్టి జ్ఞానంకూడ పరిణామి కాదు. ఎప్పుడూ ఒకటిగా ఉంటుంది. పరిణామి కాక ఎప్పుడూ ఒకటిగా పారమార్థికంగా (Absolute) ఉండేదానికి ఉత్పత్తి, అభివృద్ధి, వినాశాలు ఉంటాయి. కాబట్టి జ్ఞానం ఉత్పాద్యం కాజాలదు. అందువల్ల అది అపౌరుషేయం. మున్నెన్నడూ తెలియనిదానిని క్రొత్తగా నేర్చుకోటానికి వీలులేదు. జ్ఞానం కేవలం అభివ్యజ్యం మాత్రమే. లేదా స్మర్తవ్యం. అంతేకాని ఉత్పాద్యం కాదని తేలుతుంది.

## జ్ఞానం అభివ్యఙ్గ్యం, లేదా స్మర్తవ్యం

ఇలాంటి తర్కంతో సిద్ధిస్తున్న జ్ఞానవాదనే ప్లేటో ప్రతిపాదిస్తున్నాడు. అతని మతంప్రకారం ఆత్మకు జ్ఞానం స్వతస్సిద్ధంగా ఉంటుంది. దేవతాబృందపరివృతమై కామసంకల్పాలనే రెక్కల గుర్రాలు పూన్చిన రథమెక్కి స్వర్గోపరిభాగమందున్న గమ్యస్థానానికి పోతూ ఆత్మ ఆ గుర్రాలను అదుపులో ఉంచుకోలేక పడిపోయినప్పుడు ఉన్న జ్ఞానం మరచిపోతుందని ప్లేటో "ఫీడ్రస్" (Phaedrus) లో చిత్రించాడు.

జ్ఞానం అభివ్యఙ్గ్యం లేదా, స్మర్తవ్యం అనేవాదం "మినో" లో ఈవిధంగా నిరూపితమౌతుంది : సోక్రటిస్ మినో సేవకుణ్ణి పిలిపిస్తాడు. వాడు చిన్నవాడు. చదువుసంధ్యలు రావు. సోక్రటిస్ బల్లమీద ఒక చతురస్రాన్ని గీసి దానికి రెట్టింపు విస్తీర్ణతకల చతురస్రపుతత్త్వం ఎలా ఉంటుంది ? దాని భుజంపొడవు ఎంత ? అని అడుగుతాడు. వాడు ముందు చెప్పలేడు. సోక్రటిస్ పై ప్రశ్నలకు సమాధానం తాను చెప్పకుండానే ఒకొక్క ప్రశ్నే వేస్తూపోతాడు. ఆ సేవకుడు వరుసగా సమాధానాలు చెప్పుకుంటూ పోతూ, చివరికి మొదటి చతురస్రకర్ణం (Diagonal) రెండవదానికి భుజమైతే ద్వితీయచతురస్ర విస్తీర్ణత రెట్టింపు ఉంటుందని చెబుతాడు.

చదువు సంధ్యలులేని ఆ సేవకుడు ఎలా సరియైన సమాధానం చెప్పాడు? కాబట్టి జ్ఞానం అభివ్యఙ్గ్యం, లేక స్మర్తవ్యమే కాని ఉత్పాద్యం కాదు.

ఈ వాదానికే ఫీడోలో (Phaedo) ప్లేటో మరొక ఉపపత్తి చూపించాడు.

మనకు ధర్మం, రామణీయకం, సమానత్వం మొదలైన భావాలజ్ఞానం ఉన్నది. భావాలంటే ఏమిటో చూచాము. భావాలజ్ఞానం ప్రత్యక్షంవల్ల లభించేది కాదు. భౌతిక జగత్తులో ఎక్కడా పారమార్థిక ధర్మంగాని,

సమానత్వం కాని, రామణీయకం కాని గోచరించటంలేదు. భౌతికలోకంల సమానంగా, ధార్మికంగా, రమణీయంగా ఉన్న వస్తువులలో సమానత్వ ధర్మం, రామణీయకం, అసమగ్రాలు కాని పూర్ణాలు కావు. అంటే భౌ విషయాలలో గోచరించే ఈ సమానత్వం మొదలైనవి పారమార్థికాలు కా అయినా పారమార్థిక భావాలు మనకు ఉంటున్నాయి. ఇది ఎలా సం విస్తున్నది ?

సాహచర్య, సాదృశ్య, అసాదృశ్యాదుల వల్ల ఒకవస్తువును చూ గానే రెండో వస్తువు జ్ఞాపకం వస్తుంది. మన మిత్రుడు ఎప్పుడూ భారత చదువుతుంటా డనుకోండి. భారతం కనిపించగానే మిత్రుడు జ్ఞప్తికి వస్తాడ ఇలాగే వికారవస్తువులను చూచినప్పుడు రమణీయవస్తువులు రమణీయ వస వులు చూచినప్పుడు వికృతవస్తువులు జ్ఞాపకం వస్తాయి. అసలు వీనిని చూ ఉండకపోతే తరువాత జ్ఞప్తికి రావటం అసంభవం.

అలాగే అసమగ్రాలైన భౌతిక సమానత్వాది భావాలను చూడట వలన పారమార్థిక సమానత్వాదులు తెలుస్తున్నవి. అంటే స్మృతిము తున్నవి. అంటే పూర్వం వీటిని చూచి వుండాలి. కాబట్టి జ్ఞానం స్మ వ్యమే కాని ఉత్పాద్యం కాదు.

పునరుక్తి దోషం లేదనుకొంటే ప్లేటో తాత్పర్యం మరొకవిధంగ సుబోధం చెయ్యవచ్చు. మనం ఒక కావ్యాన్ని చదివామనుకోండి. అ బాగున్నదనో, లేదనో అనుకొంటాము. మన మనుకొనే ఆ బాగోగుల మనలోని ఒకానొక ప్రమాణాన్ని అనుసరించి కొలుస్తున్నామా, లేదా అంటే, నిజమే. మనలోని ఒక ప్రమాణాన్ని బట్టి కొలుస్తున్నమాట వాస్తవం. అయితే యీ ప్రమాణం ఇతర కావ్యాలను చదవటంవల్ల, అంటే భూతపూర్వ ఐంద్రియకానుభవంవల్ల ఈ ప్రమాణం ఏర్పడుతున్నదని అన వచ్చును. సరే, అలాగే నందాము. ఏ కాళిదాసు అభిజ్ఞాన శాకుంత లమో, ఏ షేక్స్పియర్ నాటకమో, ఏ డాంటే కావ్యమో చదువు తాము. అది చాలా బాగున్నదంటాము. అంటే ఏదో ఒక ప్రమాణంతో కొలుస్తున్నామన్నమాట. అయితే యీప్రమాణంకూడా భూతపూర్వప్రత్య

జ్ఞానుభవంవల్ల ఏర్పడిందేనా? అంటే కాళిదాసు, షేక్స్పియర్, డాంటేల రచనలకంటె ఉత్తమమైన రచనలను ఈ జన్మలో చూడటం జరిగిందా? అసంభవం. ఇలాంటి ప్రమాణం మనలో ఉన్నమాట యథార్థం. అది ఈ లోకంలో ప్రత్యక్షానుభవంవల్ల సంపాదించలేదన్నమాటకూడా యథార్థం, కాబట్టి ఈప్రమాణం పూర్వం భౌతికలోకంలో కాకుండా మరొకచోట సంపాదించి ఉండాలి, అందువల్లనే అది జ్ఞాపకం వస్తున్నది.

ఈ విధంగా జ్ఞానం అభివ్యజ్యం, లేక స్మర్తవ్యమే కాని ఉత్పాద్యం కాదన్న సిద్ధాంతంతో చారిత్రాత్మకజ్ఞానం మొదలైన వ్యావహారిక జ్ఞానమంతా జ్ఞానంకాకుండా పోతున్నది. అంటే "ప్లేటో ఫలానప్పుడు ఫలాని దేశంలో పుట్టాడు, ఫలాని పుస్తకాలు వ్రాశాడు, ఫలాన ఫలానసిద్ధాంతాలు ప్రతిపాదించాడు," అన్నది జ్ఞానంకాకుండా పోతున్నది. ప్లేటో సిద్ధాంతం ప్రకారం తర్కగణితశాస్త్రజన్యజ్ఞానము, యోగజన్యజ్ఞానము (Mystic insight) మాత్రమే జ్ఞానం. తతిమ్మాదేదీ జ్ఞానంకాదు.

# ఆత్మస్వరూపం - జన్మపరంపర

ప్లేటో ప్రతిపాదించిన జ్ఞానస్వరూపాన్నిబట్టి రెండు జగత్తు లేర్పడు తున్నవి. మొదటిది ఆధ్యాత్మిక జగత్తు; రెండవది భౌతికజగత్తు. మొదటి దాని ఛాయ రెండవది. ఇలా రెండంకణాల మేడ ఏర్పడిన తరువాత ఈ రెంటినీ కలిపే నిచ్చెన ఒకటి ఉండాలి. లేకపోతే రెండో అంతస్తు ఉండి ప్రయోజనంలేదు. అసలు పై అంతస్తులో ఏ మున్నదో తెలియదు. కాబట్టి నిశ్రేణి అవసరం. అదే ఆత్మ. ఈ ఆత్మ తన పుణ్యపాపాలనుబట్టి పైకీ క్రిందికీ ఆసులోని క్రోవిలాగా తిరుగుతుంటుంది. అందువల్ల రెండు జగత్తుల తత్త్వం అర్థంచేసుకొంటుంది.

ఈ పైని పేర్కొన్న నిశ్శేణీదృష్టాంతాన్నిబట్టి ఆత్మ జడపదార్థమని కాని, తనకుతాను ఉపయోగపడేది కాదనికాని అర్థంచేసుకోరాదు. కేవలం ఆవశ్యకత ఒక్కటే ఆత్మనిశ్రేణుల కున్న సమానధర్మం. ఆత్మ అనేది లేక పోతే ఆధ్యాత్మికజగత్తు లేక పోవలసివస్తుంది. ప్లేటోమతం ప్రకారం ఆధ్యాత్మికజగత్తు లేక పోతే భౌతికజగత్తు లేకపోతుంది. అందువల్ల అతని మతానికి ఆత్మ ఉండటం అవసరం.

ఆత్మ ఉన్నదనటానికి ఫీడోలో (Phaedo) అతడు ముఖ్యంగా ఈ రెండు ఉపపత్తులను చూపిస్తాడు. భౌతికాలైన ద్వంద్వాలనుండి తత్ప్రతిద్వంద్వాలు పుడుతున్నాయి. ఉదాహరణకు పగలు తీసుకొందాము. దీనికి ప్రతిద్వంది రాత్రి. రాత్రినుంచి పగలు, పగటినుంచి రాత్రి పుడుతు న్నాయి. అలాగే జాగ్రదవస్థనుంచి సుషుప్త్యవస్థ, సుషుప్త్యవస్థనుంచి జాగ్రదవస్థ కలుగు తున్నాయి. అలాగే జీవంనుంచి మరణం, మరణంనుంచి జీవం కలుగుతున్నాయి. అలా కాక పుట్టినవన్నీ శాశ్వతంగా మరణిస్తూ ఉంటే ఒక కాలానికి అన్నీ మృతిపొందటం సజీవమైనది లేకపోవటం, జరగాలి. అంటే మృతి ఒక్కటే శేషించి సర్వం కబళితమై పోవాలి. అందువల్ల మృతినుండి జీవం విధిగా పుడుతున్నదని అంగీకరించాలి. ఇది

నిజమైతే శరీరపతనం జరగగానే ఆత్మ మరొక లోకంలో చావకుండా ఉండాలి. లేనిపక్షములో అది తిరిగిజన్మించటం అసంభవం. కాబట్టి నిత్యమై ఆత్మ ఉండాలి.

జ్ఞానం స్మర్తవ్యమే కాని ఉత్పాద్యంకాదని ప్లేటో ఎలా నిరూపించాడో చూదాము. ఈజన్మలో ప్రత్యక్షజ్ఞానంవల్ల పొందజాలని పారమార్థిక భావాలను మానవుడు నిర్మించగలుగుతాడు. అంటే ఆత్మ ఈజన్మకు పూర్వం ఉండి ఉండాలి.

ఈ రెండు ఉపపత్తులనుబట్టి ఆత్మ ఉన్నదని తెలుతున్నది. ఈఆత్మ, దివ్యం, అమర్త్యం, చేతనం, సమం ( Uniform ) అచ్ఛేద్యం. శరీరం దీనికి కేవలం విరుద్ధం. ఇది భౌతికం, మర్త్యం, జడం, విషమం (Multiform) ఛేద్యం, పరిణామి.

ఆత్మ సామరస్యం ( Harmoy ) కాదు. ఎందుకంటే సామరస్యం ఏ ద్రవ్యాలవల్ల ఎర్పడుతున్నదో వాని స్థితిలోనే ఆ సామరస్యంఉంటుంది. అంగాలు కుంటువడితే, సామరస్యం కుంటుపడుతుంది. లేకపోతే లేదు. కాబట్టి అంగాల ననుసరించి సామరస్యం ఉంటున్నది. కాని సామరస్యం ననుసరించి అంశాలు ఉండటంలేదు. అవయవాలకంటె విరుద్ధమైన గతికాని, ధ్వనికాని, మరొకగుణంకాని సామరస్యాని కుండదు. సామరస్యస్వభావం అంగముల సమరసభావంపై ఆధారపడిఉంటుంది. అంటే ఈసామరస్యంలో తరతమాదిభావా లుంటున్నాయి.

ఇలాంటి తరతమ భావాలు ఆత్మలో లేవు. ఆత్మలలోఎచ్చులొచ్చులు లేవు. అన్ని ఆత్మలు ఒక్కటే. ఆత్మ సామరస్యమైతే శరీరాన్ని అనుశాసించక శరీర అనుశాసన మనుసరించి ఆత్మ పోవాలి. పైగా అవయవి నశిసుంది. నిరవయ నశించదు. ఆత్మ నశించనిది కాబట్టి నిరయవము.

ఆత్మ స్వయంగతికము. అంతేకాని మరొక పదార్థంవల్ల దీనికి గతి ఏర్పడటం లేదు. ఈగతి ఉత్పన్నంకాదు కాబట్టి నష్టమూకాదు.

ఆత్మ ఉనికివల్లనే దేహాలు జడాలైనా చేతనాలవలె కన్పిస్తున్నవి. రెక్కల గుర్రాలజంట రౌతువంటిది ఆత్మ. దీనినిబట్టి గుర్రాలు వేరుగా ఉంటాయి, రౌతు వేరుగా ఉంటా డనుకోరాదు. గుర్రాలజంట, రౌతు అవిభాజ్యాలు. ఇలాంటిది ఆత్మ. దేవతాత్మకు, జీవాత్మకు పెద్ద తేడా లేదు. దేవతాత్మ గుర్రాలు ఉత్తమాలు. జీవాత్మగుర్రాలు పొగరుబోతులు. దేవ తాత్మ తన గుర్రాలను చక్కగా అదుపులో ఉంచుకొని నడపగలుగుతుంది. జీవాత్మ తనగుర్రాలను అదుపులో ఉంచుకొని నడపటం అతి కష్టసాధ్యం. ఆత్మలోని సారథి శబ్దవాచ్యం, వివేకం (Reason) అశ్వ శబ్దవాచ్యాలు సంకల్పము, కామము. ఈ మూడంశాలు జీవితంలోనే కాక దేవతాత్మలో కూడ ఉంటాయి. ఈ ఉపమానం కేవలం అర్థస్ఫురణకు ఇచ్చినదే కాని సంపూర్ణసాధర్మ్యం కోసం ఇచ్చినదికాదు. జగత్తులోని అ ధర్మానికి మూలం ఆత్మలోని దుష్టాంశమేనని ప్లేటో సిద్ధాంతం.

ఆత్మలు మూడురకాలు ;— (౧) జీవాత్మ, (౨) దేవతాత్మ, (3) పరమాత్మ. ఈ మూడూ ఆత్మలే. అయితే యీ ఆత్మలు వేరు, భావాలు వేరు. వ్యక్తిలో భావం అభివ్యక్తం కావటానికి ఈ పరమాత్మ, లేక ఈశ్వరుడు కారణం. ప్లేటో ఈశ్వరుడు ఒక్కడనీ, ఆత్మలు అనే కాలనీ స్పష్టంగా సూచించాడు. అయితే ఈశ్వరునకూ, తదొచ్ఛేద్యమాన జగత్తునకూ ఏలాంటి సంబంధమున్నదో మాత్రం నిర్దిష్టంగా చెప్పలేదు.

ఆత్మకు జన్మ ఎలా ప్రాప్తిస్తున్నది? అది దేవతల వెంట స్వర్గో పరిభాగమందున్న భావ ప్రపంచ సందర్శనానికి బయలుదేరుతుంది. దేవతలు తమ రెక్కలగుర్రాల జంటలను అవలీలగా నడుపుకొని పోతుంటారు. ఈ ఆత్మలకు తమ గుర్రాల జంటలను అదుపులో ఉంచుకోవటం కష్టసాధ్య మౌతుంది. తన గుర్రాలను అదుపులో ఉంచుకొని నడపలేని ఆత్మ స్వర్గ భ్రష్ట మౌతుంది. ఇలా భ్రష్టమయ్యేటప్పుడు రెక్కలు పోతాయి. తుదికి భూమిమీద పడుతుంది. అలా పడినప్పుడు భౌతిక శరీర మేర్ప డుతుంది. ఈశరీరం నిజానికి జడమైనా ఆత్మసంసర్గంవల్ల చేతనం వలె భాసిస్తుంది. ఇలా శరీర సహితమయ్యే ఆత్మయే మానవుడు.

"అయితే అమర్త్యమైన ఆత్మకు నశ్వరమై పదార్థంతో సంసర్గమేర్పడదని సహేతుకంగా నిరూపించ వీలులేదు. నిజానికి ఈశ్వరునిస్వభావం మనం చూడలేదు. గట్టిగా తెలియదుకూడా. అయినా అమర్త్యమైన ఆత్మలకు శరీరం ఉంటుందని ఊహించవచ్చును."

స్వర్గభ్రష్టతకు పూర్వం ఎక్కువ సత్యంచూచిన ఆత్మ తత్త్వవేత్తగా జన్మిస్తుంది. లేదా రామణీయక తత్త్వపరుడుగానో, కాక, సంగీతప్రియుడు గానో, కాక ప్రణయశీలుడుగానో జన్మిస్తుంది. ౨. అంతకన్నా తక్కువ సత్యంచూచినది ఉత్తమ భూపాలుడుగానో, సేనాధిపతిగానో జన్మిస్తుంది. 3. అంతకన్నా తక్కువ చూచినది రాజకీయవేత్తగానో, వణిజుడుగానో జన్మిస్తుంది. ర. అంతకన్నా తక్కువ చూచినది వ్యాయామాభిమానిగానో, వైద్యుడుగానో జన్మిస్తుంది. ౫. అంతకన్నా తక్కువ చూచినది ప్రవక్త గానో, మతగురువుగానో పుడుతుంది. ౬. అంతకన్నా తక్కువ చూచినది కవిగానో, చిత్రకారుడుగానో, లేక మరొకలలితకళా స్రష్టగానో పుడు తుంది. ౭. అంతకన్నా తక్కువ చూచినది ఏ రైతుగానో పుడుతుంది. ౮. అంతకన్నా తక్కువచూచినది వైతండికుడుగానో, లేక Demagoue గానో పుడుతుంది. ౯. అంతకన్న తక్కువచూచినది ఘోరచండశాసను డుగా పుడుతుంది.

ఇహలోకంలో పుణ్యంచేస్తే ఆత్మ మరుజన్మలో పూర్వంకంటే ఉత్తమజీవిగా పుడుతుంది. ఇలా పుణ్య మెక్కువగా సంపాదిస్తూపోతే తుదికి ఆత్మ జన్మరాహిత్యం పొంది జ్ఞానసిద్ధిపొందుతుంది. అలాకాక పాపం ఎక్కువచేసినకొలదీ అధఃపతనం చెందుతుంటుంది.

# సృష్టిక్రమం

సృష్టిక్రమాన్ని గూర్చి ప్లేటో టిమీయస్ (Timaeus)లో వ్రాశాడు. ఇందలి విషయనిర్ణయంలో వ్యాఖ్యాతలందు అభిప్రాయభేదా లున్నాయి. పైగా ఈఅంశాలలో ఎంతవరకు కట్టుకథలో, ఎంతవరకు అతని అభిమత ముందో చెప్పలేము. ఏది ఎలా ఉన్నా అతని మతం స్థూలంగా చెప్పా లంటే ఇలా ఉంటుంది :

మారనిదానిని బుద్ధి వివేకం గ్రహిస్తాయి. మారేదానిని అభిప్రాయం గ్రహిస్తుంది. జగత్తు భౌతికం; కాబట్టి నిత్యం కాజాలదు. దీనిని ఈశ్వరుడు సృజించాడు. ఈశ్వరుడు ధర్మమయుడు. అతడు నిత్యపదార్థాన్ని అనుస రించి ఈ జగత్తును నిర్మించాడు. అతడు ఈర్ష్యారహితుడు. అందువల్ల ప్రతిదీ సాధ్యమైనంతవరకు తనవలె ఉండాలని అతని అభిలాష. భౌతికపదార్థం నామరూపరహితంగా, వ్యవస్థారహితంగా ఉంటే ఈశ్వరుడు వ్యవస్థ కల్పించాడు. ఆత్మలో బుద్ధినుంచి దానిని శరీర నిహితం చేశాడు. అతడు ఈ జగత్తును ఒకజీవిగా సృష్టించాడు. ఈ జీవికి ఆత్మ, బుద్ధి ఉన్నాయి. అయితే ఈ జగత్తు ఒక్కటే కాని అనేకాలు కావు. ఎందువల్లనంటే నిత్య భావానికి సాధ్యమైనంత సన్నిహితంగా ఉండాలన్న దృష్టితో ఈశ్వ రుడు ఈ ప్రతిని సృష్టించాడు. అందువల్ల జగత్తు ఒక్కటే. ఇది ఒక గోళం. అసాదృశ్యంకంటె సాదృశ్యం మనోజ్ఞం. సర్వత్ర ఒకేవిధంగా ఉండేది. గోళమొక్కటే. అందువల్ల జగత్తు ఒక గోళం. అది భ్రమిస్తుంది. ఎందువల్ల నంటే గతులన్నిటిలోను భ్రమణాత్మకగతి నిర్దుష్టం.

ఈశ్వరుడు అగ్ని, వాయువు, జలము, పృథ్విఅన్న నాలుగు భూతా లతో ఈ జగత్తును సృష్టించాడు. గ్రీకులకు భూతాలు నాలుగే కాని ఐదు కావు. (వారిమతం ప్రకారం ఆకాశంలేదు.) సమర స్వభావమేర్పడేటట్లు గా ఈ నాలుగు భూతాలను తగిన నిష్పత్తిలో కలిపి సృష్టించటం వలన ఈ

జగత్తు జరావ్యాధులకు గురికాదు. భగవంతుడు సంకల్పిస్తే తప్ప ఇది విలయం పొందదు.

ఈశ్వరుడు మొట్టమొదట ఆత్మ, తరువాత శరీరం సృష్టించాడు. ఆత్మ అవిభాజ్యం. అది పరిణామ రహితమయిన పదార్థంతో నిర్మితం. శరీరం విభాజ్యం. పరిణామియైన ఒకానొక పదార్థంతో సృష్టింపబడ్డది. ఇది భావంకంటె ఆత్మలకంటె భిన్నం.

చరము, సజీవము అయిన ఈ జగత్తునుచూచి ఈశ్వరుడు హృష్టుడై దీనిని మూలానికి, అంటే జగద్భావానికి సాధ్యమైనంత సన్నిహితంగా ఉంచాలని సంకల్పించాడు. మూలము నిత్యం కాబట్టి ఈ జగత్తును కూడా వీలయినంత నిత్యంగా ఉండేటట్లు చేయాలను కొన్నాడు. ఈ నిత్యతను సమగ్రంగా జగత్తుకు ప్రసాదించటం అసంభవం. అందువల్ల ఈనిత్యత్వానికి చరచ్ఛాయ కల్పించటానికి నిశ్చయించాడు. ఆకాశంలో వ్యవస్థ నెలకొల్పి ఈ చరన్నిత్యత్వం కల్పించాడు. ఈ ఛాయయే కాలం.

ఈ కాలానికి పూర్వం పగళ్ళులేవు. రేలు లేవు. నిత్యత్వభావాన్ని గూర్చి చెప్పవలసి వచ్చినప్పుడు ఉండెను అని కాని, ఉండగలదు అని కాని చెప్పటానికి వీలులేదు. ఉన్నది అని మాత్రమే చెప్పాలి.

కాలం, ఆకాశం ఒకేసారి సృజింపబడ్డాయి. జీవులు గణితం నేర్చుకోటానికి ఈశ్వరుడు సూర్యుణ్ణి సృష్టించాడు. దివారాత్రాలు, మాసాలు, సంవత్సరాలు చూడటంవల్ల సంఖ్యాజ్ఞానం, దానివల్ల కాలజ్ఞానం, దానివల్ల తత్త్వజ్ఞానం ఏర్పడ్డాయి. ఇది ఒక్క చే ప్రత్యక్షంవల్ల కలుగుతున్న మహోపకారం.

జగత్తువినా నాలుగు రకాల జీవులున్నాయి. (౧) దేవతలు, (౨) పక్షులు, (3) జలచరాలు, (౪) భూచరాలు. దేవతలు ప్రధానంగా అగ్నిమయులు, నిశ్చలతారలు దివ్యాలు. ఇవి నిత్యాలు. ఈ దేవతలకు "మిమ్ము ధ్వంసంచేయగలను." అని ఈశ్వరుడు చెప్పాడు. కాని వీరిని

ధ్వంసం చేయడు. ఇతర జీవులలోని నిత్యాంశాలను భగవంతుడు సృష్టించాడు. అనిత్యాంశాలను దేవతలు సృష్టించారు.

ప్రతితారకు ఈశ్వరుడు ఒక ఆత్మను ఇచ్చాడు. ఆత్మలకు ఇంద్రియానుభవజ్ఞానం, ప్రేమ, భయం, కోపం ఉంటాయి. వీటిని దమించగలిగితే ఇవి పవిత్రజీవనాలు. లేకపోతే కావు. మానవుడు సత్పథాన నడిస్తే మరణానంతరం తన నక్షత్రంలోకి పోయి శాశ్వతంగా సుఖంగా జీవిస్తాడు. దుష్టమార్గానువర్తి అయితే మరుజన్మలో స్త్రీగా జన్మిస్తాడు. అప్పటికీ సన్మార్గం అనుసరించకపోతే, అది జంతువై పుడుతుంది. ఇలా వివేకం కలిగేటంతవరకు జన్మలు ప్రాప్తిస్తూనే ఉంటాయి. ఈశ్వరుడు ఆత్మలను కొన్ని భూలోకంలోను, కొన్ని చంద్రలోకంలోను, కొన్ని ఇతర గ్రహనక్షత్రాలలోను ఉంచాడు. వాటి శరీరనిర్మాణం దేవతలకు వదలిపెట్టాడు.

మానవునిలో రెండు ఆత్మలున్నాయి. ఒకటి నిత్యం. దీనిని ఈశ్వరుడు సృష్టించాడు. రెండోది అనిత్యం. దీనిని దేవతలు సృష్టించారు. అనిత్యమైన ఆత్మ అనివార్యం, భయంకరము అయిన సంవేదాలకు (Affections) లోనౌతుంది. సుఖం పాపకృత్యాలను ప్రోత్సహిస్తుంది. దుఃఖం ధర్మవిముఖం చేస్తుంది. ఉద్వేగం, భీతి గ్రుడ్డివి. క్రోధం సంతృప్తి అభిలషిస్తుంది. ఆశ పెడమార్గానికి ఈడుస్తుంది. ఇలాంటి సుఖాదికాన్ని అవివేకం ప్రేమలతో జోడించి దేవతలు అనిత్యాత్మను నిర్మించారు.

నిత్యాత్మ శీర్షం. అనిత్యాత్మ హృదయం. పిరికిపందలు, వక్రమార్గులు మరుజన్మంలో స్త్రీలై పుడతారు. అమాయికులు, లఘుబుద్ధులు, గణితశాస్త్రజ్ఞానం లేకుండానే నక్షత్రాలవంక చూచినంతమాత్రాన ఖగోళశాస్త్రం నేర్చుకోవచ్చుననుకొనేవారు పక్షులై జన్మిస్తారు. తత్త్వజ్ఞానం లేనివారు వన్యమృగాలై పుడతారు. మరీ మూఢులు చేపలై పుడతారు.

# ధర్మ స్వరూపం

ఇంతవరకు జ్ఞానస్వరూపం, ఆత్మలక్షణం, సృష్టిక్రమం చూచాము. ఇక ధర్మాన్నిగూర్చి ప్లేటో ఏమి చెబుతున్నాడో చూదాము.

జ్ఞానస్వరూప విచారసందర్భంలో భావజగత్తు ఒక్కటే యథార్థమనీ, యీ భౌతికజగత్తు ఆభాసమనీ తేల్చుకొన్నాము. ధర్మం కూడా ఆ భావజగత్తులోనిది. అంటే ధర్మంఅనేది యథార్థం. అది మనఃకల్పితంకాదు. భౌతికమూ కాదు. దృక్కునకంటె (Subject) భిన్నం. అంటే మానవుడు దానిని కల్పించలేదు. ధర్మం అతని యిష్టానిష్టాలమీద ఆధారపడిలేదు. మానవుని కోరికలను అభిమతాలను ఆశ్రయించి ఉండటంలేదు. ధర్మస్వరూపం దేశకాలపాత్రలనుబట్టి, మానవుల ఊహలనుబట్టి ఏర్పడటంలేదు. అంటే ఒకటి అనాదినుంచి వస్తున్నంతమాత్రాన, ప్రజానీకం శిరసావహిస్తున్నంతమాత్రాన, ఒకజాతిలో సంప్రదాయం అయినంతమాత్రాన ధర్మం కాదు. ఈధర్మం అనేది ఒకదేశంలో, ఒకజాతికి, ఒకవ్యక్తికి, ఒకప్పుడు ధర్మమై మరొకదేశంలో, మరొకజాతికి, మరొకవ్యక్తికి, మరొకప్పుడు ధర్మం కాకపోదు. ధర్మమైనది మూడుకాలాలకు, సర్వదేశాలకు, సర్వరాజ్యాలకు, సమస్తవ్యక్తులకు ధర్మమే. ఈధర్మాన్ని ఆచారవ్యవహారాలుకాని, సంప్రదాయాలుకాని, అభిప్రాయాలుకాని నిర్దేశించలేవు. వీటిమీద ధర్మం ఆధారపడి లేదు. ఈధర్మం పంచేంద్రియగోచరం కాదు. అంటే ప్రత్యక్షానుభవవేద్యం కాదు. ఊహాపోహలకు అందేది కాదు. ఏకతానతాప్రాప్యం ( Intuitional ) అంతకన్న కాదు. కేవలం వివేకైకవేద్యం. అందువల్ల ధర్మస్వరూప నిర్ణయంలో ప్రజల అభిప్రాయంతో కాని, ప్రత్యక్షానుభవాలతో కాని, వృద్ధాచారాలతో కాని, సంప్రదాయాలతో కాని నిమిత్తంలేదు.

ఈ ధర్మం వ్యక్తికైనా, రాజ్యానికైనా, ప్రభుత్వానికైనా ఒకటే. ఇది వ్యక్తిధర్మం, ఇది ప్రభుత్వధర్మం, ఇది రాజకీయధర్మం, ఇది సామా

జికం అన్న విభేధం లేదు. అందరు వ్యక్తులకూ, అన్ని ప్రభుత్వాలకూ ధర్మం ఒక్కటే. అంటే ధర్మం ఒకటే అయినా అటు వ్యక్తికమూ, ఇటు సామాజికమూ అవుతున్నది. పారమార్థికమూ, నిత్యమూ, యథార్థమూ, వివేకైకవేద్యమూ అయిన ఈ ధర్మభావం వ్యక్తిద్వారా సమాజంద్వారా అభివ్యక్తమౌతున్నది.

భావజగత్తులో ఈ పారమార్థికధర్మానికి ప్లేటో ఇచ్చినస్థానం అనన్యం. ఈ ధర్మభావంవల్లనే జ్ఞాత పదార్థానికి సత్యత్వము, జ్ఞాతకు జ్ఞానశక్తి లభిస్తున్నాయి. ఈ ధర్మభావమే శాస్త్రానికీ, జ్ఞానానికి విషయమౌతున్న సత్యానికీ కారణం. సత్యము, జ్ఞానమూ రమణీయములే అయినా ధర్మభావం రమణీయతరం. భౌతికజగత్తులో సూర్యుని కేలాటి స్థాన మున్నదో భావ ప్రపంచంలో ధర్మానికి అలాంటి స్థానమే ఉంది. సూర్యుడు చూపునకు వెలుగునకు, అర్థప్రకాశానికి, జగత్సృష్టిపోషణలకు కారణం. అయినా సూర్యుడు చూపుకంటె, వెలుగుకంటె, అర్థప్రకాశంకంటె, సృష్టిపోషణల కంటె భిన్నుడు. అలాగే ధర్మం కూడా తతిమ్మా భావాలకు కారణం. చూపు, వెలుగు సూర్యునివలె ఉన్నా ఎలా సూర్యునికంటే భిన్నమో, శాస్త్రము, సత్యము ధర్మమువంటివే, అయినా, ధర్మం కావు. శాస్త్రంకంటె సత్యంకంటె ధర్మం ఉత్తమం.”

ప్లేటో ఇలా భావాలకు ధర్మం మూలమని రిపబ్లిక్ అనే గ్రంథంలో సూచించినా, ఇతర రచనలలో యీవిషయం స్పృశించలేదు. ఆ గ్రంథంలో నైనా లోతుకుపోయి ధర్మంనుంచి తతిమ్మా భావాలు ఎలా నిష్పన్నమౌతు న్నవో విశదీకరించలేదు. ఏది ఎలా ఉన్నా అతడు బహుత్వవాదే (Pluralist) కాని ఏకత్వవాది కాడు.

ఇంతకూ మానవజీవితలక్ష్య మేమిటి? అతడు జీవితంలో ఏమి సాధించాలి? వ్యక్తిగా, సామాజికుడుగా ఏమి చేయాలి? ఎలాంటి జీవితం సార్థకం? ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పకొనేముందు లోగడ చెప్పకొన్న విషయాలు గుర్తుకు తెచ్చుకోవాలి. భౌతిక పదార్థాలన్నీ నశ్వరాలు, అయథార్థాలు. అయితే యివి పారమార్థిక భావాలను అభి

వ్యక్తం చేస్తున్నాయి. అంతకుతప్ప వీనివల్ల ప్రయోజనం లేదు. ఈ జగత్తులో ఆత్మఒక్కటే నిత్యం, సత్యం. దేహిఅయిన ఆత్మకు భావాల జ్ఞానం పొందటం కర్తవ్యం. అయితే, యింద్రియజన్యజ్ఞానం యథార్థం కాదు. పంచేంద్రియాలవల్ల అభిప్రాయంమాత్రమే కలుగుతున్నది. అందువలన ఇంద్రియ లోలుడైన మానవుడు జ్ఞానం పొందలేడు. జ్ఞానం పొందలేకపోగా దానికి దూరమాతున్నాడు. జ్ఞానమే పుణ్యం. పుణ్యపురుషుడు ఇంద్రియలోభాలకు లోబడడు. ఇంద్రియాలను జయించి అంతర్ముఖుడై విచారం సాగిస్తాడు. అసలు శరీరం ఉండగా యథార్థజ్ఞానం దుర్లభం. ఎందుకంటే, శరీరంవల్ల కలిగే యాతనలు అన్నీ యిన్నీ కావు. దానికి తిండి కావాలి. తిండి ఉన్నా, వ్యాధి పీడిస్తూ మనస్సును చీకాకుపరచి సత్యాన్వేషణ సాగనీదు.' తిండి ఉండి వ్యాధులు లేకపోయినా, శరీరం అరిషడ్వర్గమంత్రాంగానికి లోనై ముప్పతిప్పలు పెడుతుంది. విచారించే శక్తికూడా లేకుండా చేస్తుంది. యుద్ధాలు, స్పర్థలు, వైమనస్యాలు ఎందుకు వస్తున్నాయి ? ఈ శరీర మనేది లేకపోతే ఇవన్నీ ఉంటాయా ? ధనలోభం వలన యుద్ధాలు వస్తున్నాయి. శరీరపోషణకోసం, రక్షణకోసం ధనలోభం ఏర్పడుతున్నది. ఈ ప్రతి బంధకాలన్నిటివల్ల తత్వవిచారానికి వ్యవధి లభించటంలేదు. ఒకవేళ అవకాశం లభించినా శరీరం విచారానికి అడ్డుతగిలి, మనోమాలిన్యాలను రెచ్చగొట్టి, సంక్షోభం కలిగించి సత్యం తెలుసుకోనీకుండా చేస్తున్నది. అసలు నిజంగా దేనినిగూర్చి అయినా యథార్థజ్ఞానం కలగాలంటే ఈ దేహత్యాగం జరిగితేతప్ప వీలు లేదని అనుభవం రాయి గుద్ది చెబుతున్నది. పంచేంద్రియాలకుదూరమై, అంతర్ముఖమైనప్పుడు ఆత్మ వస్తువుల యథార్థ స్వరూపం తెలుసుకొంటుంది. అప్పుడే వివేకం లభిస్తుంది. అయితే శరీరం ఉండగా మాత్రం ఇది జరగదు. ఎందుకంటే, శరీరం ఉండగా ఆత్మ నిర్మలజ్ఞానం పొందలేదు. జ్ఞానం అనేదానిని అసలు పొందటం అనేది ఉంటే మరణానంతరం పొందవలసిందే.

అందువల్ల వివేకికి ఈ దేహం హేయం. దేహమే హేయమైన

చెప్పాలి *అతడు ఇలా కేవలం ఆభాసాలను అనుకరిస్తూ ఉండటం వల్లనే అన్నివస్తువులను సృష్టించగలుగుతున్నాడు. కమ్మరిని, వడ్రంగిని మొదలైన వారినంతా సృష్టిస్తున్నాడు. కాని వారి వృత్తులలో ఒకటికూడ అతనికి తెలియదు. అయినా అతని బొమ్మలనుచూచి పిల్లలు తెలియనివాళ్ళు నిజంగా వడ్రంగిని కమ్మరిని చూస్తున్నా మనుకొంటున్నారు. చిత్రకారుడు సర్వజ్ఞుడని భావిస్తున్నారు. కాని ఇలా అనుకొనే వారికి జ్ఞాన అజ్ఞాన అనుకరణాల స్వరూపం తెలియదు.

కవి చిత్రకారాదులు అనుకరిస్తున్నారే అనుకొన్నా, అలా అనుకరించటానికైనా జ్ఞానం కావాలి కదా అనవచ్చును. కాని బింబము, ప్రతిబింబమూ సృష్టించగలిగినవాడు ప్రతిబింబసృష్టిలో ఎందుకు నిమగ్నుడౌతాడు ? జీవితానికి మరొక పరమార్థం లేనట్లుగా అనుకరణమే ప్రధానంగా ఎందుకు చూచుకొంటాడు ?

అసలు అనుకరణస్వరూపం తెల్సుకొంటే కళాసృష్టిసంగతి తేల్తుతుంది. అనుకరణం రెండువిధాలు: (౧) దివ్యము, (౨) మానవము. ఈశ్వరసృష్టి దివ్యము. మనుజుడు చేసే సృష్టి మానవం. దివ్యసృష్టి భౌతికవస్తువులను అపేక్షించదు. మానవసృష్టి అలాకాదు భౌతికవస్తువుల నూతనసంయోగంతో జరుగుతుంది. దివ్యమూ మానవమూ అయినసృష్టి తిరిగి రెండువిధాలు. (౧) యథార్థం, (౨) అయథార్థం. ప్రకృతిసిద్ధవస్తువులు, భూ సముద్రాదులు, తరు లతాదులు, పశుపక్ష్యాదులు యథార్థదివ్యసృష్టిలోనివి. స్వప్నాలు, వెలుగువల్ల ఏర్పడే నీడలు, మరీచికాదులందు గోచరించే

* ఈ అర్థమే పండితరాయలుకూడా ప్రతిపాదించాడు:—

"విభావాదీనామపి స్వప్నతురగాదీనామివ, రంగరజతాదీనామివ వాక్యార్థస్యాపి దుర్వచత్వమ్."

(రసగంగాధరం, ప్రథమాననం 26 పే.)

ఇది సిద్ధాంతమైతే బొశాంకో పేర్కొన్నట్లు సంగీత సాహిత్యకళల యాథార్థ్యం విజువ పూర్తిగా అపకృష్టమౌతుంది.

ప్రతిబింబాలు అయథార్థదివ్యసృష్టిలోనివి. గృహారామాదికములు యథార్థమానవసృష్టిలోనివి. సంగీతసాహిత్యాదిక సృష్టి అయథార్థమానవసృష్టిలోనిది.

అయథార్థమానవసృష్టి తిరిగి సదృశము, అసదృశము అని రెండు విధాలు. ఈ సదృశసృష్టిలోని ప్రతిబింబాలు బింబం ఏనిష్పత్తిలో, ఏరంగులో, ఎలా ఉంటుందో అలాగే ఉంటాయి. అసదృశసృష్టిలో అలా కాదు. ఉదాహరణకు శిల్పిచెక్కిన బృహద్విగ్రహమే తీసికొందాము. ఈ విగ్రహము అవయవాలు ప్రకృతి సిద్ధంగా ఉండే పరిమాణంలో ఉండవు. అలా ఉండకపోగా ప్రకృతిసిద్ధమూర్తి అవయవాలు ఏ నిష్పత్తిలో ఉంటాయో ఆ నిష్పత్తిలోనైనా ఉండవు. విగ్రహంక్రింద నిలిచి తల పైకెత్తి చూస్తే ప్రకృతిసిద్ధనిష్పత్తి కనుపించేటట్లుగా అవయవపరిమాణం ఉంటుంది. అంటే విగ్రహశీర్ష భాగం ప్రకృతిలో ఉన్న నిష్పత్తికంటె అధికంగా ఉంటుంది. ఇది అసదృశం. ఈ అసదృశం ఉపకరణోత్పన్నమనీ, ఆత్మోత్పన్నమనీ రెండు రకాలు. తూలికావీణాది కోత్పన్నాలైన చిత్రరాగసంచారాదికములు మొదటి దానిక్రిందికి వస్తవి. (౨) తన్నుతానే ఉపకరణంగా వాడుకొని చేసే సృష్టి నటనం (mimicry). ఈ నటనం రెండువిధాలు: ౧. తెలిసి చేసేది, ౨. తెలియకుండా చేసేది. న్యాయధర్మాదుల యథార్థరూపం తెలియనివాళ్ళు తమ వాక్కర్మలద్వారా తామనుకొనే న్యాయధర్మాదికముల ఆభాసను ప్రదర్శిస్తారు. ఇలా తమకున్న లక్ష్యాన్ని ప్రదర్శించటంలో కొందరు సఫలులౌతారు. ఇలా తెలియకుండా చేసే నటనానికి ప్రత్యేకమైన పేరు లేదు. కాబట్టి ప్రస్తుతానికి దీనిని వంచకము (Counter-feiting)అందాము. ఇలాంటి వంచన చేసేవానికి తనకు యాథార్థ్యం తెలుసునన్న నమ్మకం ఉండవచ్చును. కాని నిజానికి అతనికి తెలియదు. మరొకరకమైన వారికి తమకు తెలియునని నటిస్తున్నది నిజంగా తమకు తెలియదన్న అనుమానం ఉండవచ్చును. ఇలా తెలియదని తెలిసి కూడా చేసేవారు Imposters.

మొత్తంమీద అనుకరణం ఇన్నిపోకలు పోతున్నది. ఇలాంటి అనుకరణంవల్ల ఏర్పడుతున్న కళాస్రష్టసృష్టిలో వినియోగానికి వచ్చేది ఏమీ లేదు. ఈ సృష్టిలో అనేకవిషయాలు ప్రసక్తాలవుతాయి. పురాదివర్ణనలు

వైద్యం, సత్పరిపాలనం, జీవితపరమార్థం మొదలైనవి వర్ణితము లౌతాయి. అవి పురాదుల నిర్మాణానికి, రోగచికిత్సకు, జీవితలక్ష్యనిష్కర్షకు తోడ్పవవు. అసలు అది ఉపదేశకం కాదు.

కాబట్టి కవిచిత్రకారాది కళాస్రష్టలంతా పుణ్యాదిక ప్రతిబింబాలను అనుకరించేవారేకాని సత్యం చెప్పలేరు. చిత్రకారుడు వర్ణాలతో ఆయా ప్రతిబింబాలను అనుకరిస్తున్నట్లే కవి తన పదాలతో వాటిని అనుకరిస్తు న్నాడు. అనుకరించటానికి అవసరమైనంత జ్ఞానముమాత్రమే అతనికి ఉంటు న్నది. ఆ లయ, Mellody, ఛందస్సు, నాదము, పదగతవైచిత్రి తీసివేసి వచనంలాగా చేస్తే అసలురూప మేమిటో బోధపడుతుంది. కవుల కథల బండారం బయటపడుతుంది. ముఖం వస్తుతః అందంగా లేకపోయినా యౌవనోదయంతో వికాసం పొందుతున్నట్లుగానే ఛందోలంకారాదినిగ దితమైన కవిత వికాసంకలిగి ఉంటున్నది. యౌవననిర్గమనంతో ముఖం ముడ తలుపడి వికారం పొందుతున్నట్లే ఛందోలంకారాదులను తీసివేసి తాత్ప ర్యైకప్రధానం చేసిన రచన వికారంగా ఉంటుంది.

పైగా అనుకారికి యథార్థసత్త తెలియదు. ఆభాసాలుమాత్రమే అతనికి తెలుసు.

ప్రతిదాని ఉత్తమత్వం, రామణీయకం, సత్యం అనేది వ్యక్తి కాని ఉద్దేశించిన ప్రయోజనంమీద ఆధారపడిఉంటుంది. ఉదాహరణకు వీణను తీసికొందాము. వీణయొక్క మంచిచెడ్డలు వైణికునికే తెలుసు. ఏ వీణ బాగున్నదో, ఏది బాగుగా లేవో, ఎలాచేస్తే బాగుంటుందో అతడు వీణ చేసేవానికి చెబుతాడు. అతడు వైణికుని సలహా ననుసరించి వీణ తయారు చేస్తాడు.

వైణికుడు వీణ మంచిచెడ్డలను చెప్పగలిగినట్లుగా కవిచిత్రకారాదులు ప్రయోజనాన్నిబట్టి తమ కృతులు సరిగా, అంటే రమణీయంగా ఉన్నవో లేవో చెప్పగలరా? తాము ఏమి వ్రాయాలో దేశికునివద్ద ఉపదేశం పొందితే వారికి సరియైన అభిప్రాయం ఏర్పడుతుందా? లేదు. తమ కృతుల బాగోగులు వారికి తెలియవు. వారికి సరియైన అభిప్రాయమూ ఉండదు.

బాగోగులు దేనివల్ల ఏర్పడుతున్నవో తెలియకుండానే చిత్రకారాదులు అనుకరిస్తున్నారు. దీనినిబట్టి అజ్ఞానంలో మునిగితేలే ప్రజాసామాన్యానికి మంచిదానివలె కనుపించేదానినే వారనుకరిస్తున్నా రనుకోవాలి. " ఈ అనుకరణం ఒకవిధమైన క్రీడ, లేక ఆట."

ఈ అనుకరణం మనలోని అభిప్రాయానికి విషయమౌతున్నదే కాని, వివేకానికి మాత్రం కాదు. అనుకృతి నిజంగా అనుకృతిగా ఉంటే అది వివేకానికి విషయంకాదు. బుద్ధికీ విషయంకాదు. అభిప్రాయానికి మాత్రమే. అంతేకాదు. ఈ అనుకృతి వీక్షణ శ్రవణములకు మాత్రమే విషయ మౌతున్నది. 1 ఈఅనుకృతికి యథార్థం, లేక శివంకరమైన లక్ష్యం లేదు.

కళ అవివేకవతి. 2 ఈ అవివేకమే అనుకృతికి అనంతవస్తువైవిధ్యం ప్రసాదిస్తున్నది. వివేకవంతము, ప్రశాంతము, ఉత్తమమైనవృత్తము ఎప్పుడూ ఒకటిగా సమంగా ఉంటుంది. ఇలాంటిది అనుకరణకు దుష్కరం. ఒకవేళ అనుకృతమైనా ఆస్వాదించటం కష్టం. అందులో నానావిధ మనస్తత్వం కలిగిన జన సందోహం నాటకశాలలో సమావేశమైనప్పుడు మరీ కష్టం.

కవి స్వభావంకాని, అతని కళకాని, ఆత్మలోని వివేకాన్ని తుష్టం చేయటానికి ఉద్దిష్టంకాదు. అతడు ప్రజాసామాన్యం మెప్పుకోసం ప్రాకులాడుతాడు. అందువల్ల తేలికగా అనుకరించటానికి వీలైన ఆవేశాలను అనుకరించటానికి ఇష్టపడతాడు. ఇలాగే చిత్రకారుడు. వీరు మానవునిలోనిమనో మాలిన్యాలను రెచ్చగొట్టి వివేకానికి భంగం కలిగిస్తారు. కవి తన రచన ద్వారా మనలోని శోకాన్ని ఎంతగా పోషించగలిగితే అంతగా సంతోషిస్తున్నాము. నిజానికి మన కొక కష్టంవచ్చి దుఃఖం కలుగుతున్నప్పుడు దానిని ఎంత అణచివేసికోగలిగితే అంత గర్వపడతాము. ఇలా శోకం దిగమింగటానికి బదులుగా పైకి వెళ్ళబోసికొంటూ దానికి సంతోషించటం హేయంకాదా?

1. This imitation is confined to the sight and to the hearing relating in fact to what we term Poetry.

2. Art is irrational

కష్టాలు వచ్చినప్పుడు బావురున ఏడ్చి శోకవిముక్తి పొందాలన్న స్వాభావికవాంఛ మనలో ఉంటుంది. అయితే ఇది వివేకానికి కట్టుపడి అణగిఉంటుంది. ఈ వాంఛే కవులవల్ల తుష్టపుష్టమౌతుంది. ఈవాంఛ వివేకంవల్ల సముచితశిక్షణ పొందకపోవటంవల్ల కాని, కలుగుతున్న దుఃఖం మరొకనిదికదా అన్న సానుభూతి వల్లకాని పొంగిపొర్లటానికి అవకాశ మేర్పడుతుంది. ఇతరుడు వచ్చి తన మంచితనం, తనకువచ్చిన కష్టాలు చెప్పు కొన్నప్పుడు అతనిని ప్రశంసిస్తూ జాలిపడటంలో అవమానకరమైనది ఏమీ లేదని సామాజికుడు అపోహపడుతున్నాడు. ఈ సుఖం ఒకలాభ మను కొంటున్నాడు. వైముఖ్యం అవలంభించి ఈసుఖాన్ని, కావ్యాన్ని ఎందుకు కోల్పోవాలి అనుకొంటున్నారు. ఇతరుల అనర్థకాలవల్ల కొంత అనర్థం తనకుకూడా సంక్రమిస్తున్నదన్న పరామర్శం కొలదిమందికికూడా కల గటం లేదు.

ఇదే హాస్యానికికూడా అన్వయిస్తుంది. కొన్ని చతురోక్తులు నీకు నీవు విసరటానికి సిగ్గుపడతావు. అయినా వాటినే రంగభూమినుంచో, మరొకరి నోటినుంచో విన్నప్పుడు వినోదిస్తావు. వాటి అసభ్యతకు అసహ్యించుకోవు. ఇదంతా సానుభూతి ఉన్నప్పుడే జరుగుతుంది. మానవుని తత్త్వంలోనే ఈ హాసం వాసనారూపంగా ఉంది. అయితే ఇతరులు విదూషకు డంటూ రన్న భయంతో నవ్వరు. ఈవిధంగా వాసన వివేకానికి లోనై లోలోనే ఉండిపోతుంది. ఈ వాసన నాటకశాలలో ద్రోహదం పొంది నీకు తెలియకుండానే విదూషకుడవై పోతున్నావు*.

ఇచ్ఛాసుఖదుఃఖవిశిష్టమైన కామక్రోధాదులు మానవుని ప్రతి వ్యాపా రంలోను అవినాభావసంబంధం కలిగి ఉంటున్నాయి. కవిత్వం, కళ ఈ ఆవేశాలను, మనోమాలిన్యాలను అణచివేయటానికి బదులుగా ద్రోహద మిచ్చి పెంపొందిస్తుంది. వీటిని అదుపుఆజ్ఞలలో ఉంచక స్వేచ్ఛావిహారం

* Having stimulated the risible faculty at the theatre, you are betraying unconsciously to yourself into playing the comic part at home.

Republic, Chapt. 10.

చేయునిస్తుంది. మానవజాతి అభ్యుదయం పొందాలంటే, ఈ ఆవేశాలను కంట్రోలు చేయాలి. కాబట్టి దేవతాస్తోత్రాలు ఉత్తమ పురుషుల ప్రశంసలు తప్ప మరెలాంటి కవిత్వాన్ని రాజ్యంలోనికి అనుమతించకూడదు. అనుమతిస్తే, రాజ్యంలో పెత్తనంచేసేవి సుఖదుఃఖాలే కాని నీతి నియమాలు, వివేకం కావు.

కాబట్టి కవిత్వం సత్య సాధనంగా పరిగణించటానికి వీలులేదు. ఆత్మసిద్ధి పొందలేనివాడు దాని టక్కులకు మోసపోరాదు.

## దివ్యోద్బోధం

ఇంతవరకు లోకవృత్తానుకరణంవల్ల కళాసృష్టి జరుగుతున్నదని చూచాము. అనుకరణస్వభావం పరిశీలించాము. అయితే ఈ అనుకరణ క్రియ ఏ అవస్థలో జరుగుతుంది? తత్కృతిస్రష్టవ్యక్తిలో ఏమి జరుగుతుంది? ఈ విషయాలను విశదంగా పరిశీలించాలి.

అయస్కాంతానికి ఇనుపశలాకను ఆకర్షించే దివ్యశక్తి ఒకటిఉన్న సంగతి మనకు తెలిసినదే. అయస్కాంతాకృష్టశలాకకుకూడా అయస్కాంతశక్తివ్యాపిస్తుంది. ఆశక్తిచేత అది మరొక శలాకను ఆకర్షిస్తుంది. ఇలా అయస్కాంతమందలి దివ్యశక్తివల్ల శలాకాపరంపర ఆకృష్టమౌతున్నది. అయస్కాంతశక్తి శలాకాధారద్వారా వ్యాపించి ఆకర్షిస్తున్నట్లే సరస్వతికూడ నిజఉద్బుద్ధవ్యక్తిద్వారా, తన్మయీభావయోగ్యత ఉన్నవారందరిలోను వ్యాపిస్తుంది. అయస్కాంతంలోని ఆకర్షణశక్తి అయశ్శలాకాధారను ఆకర్షిస్తున్నట్లే కళాస్రష్టలోని సరస్వతీ సముద్బోధంకూడా తన్మయీభావయోగ్యత ఉన్నవారిని ఆకర్షిస్తుంది. ఈ విధంగా ఒకధారను సృష్టిస్తుంది. ఉత్తమకావ్యనిర్మాతల కవితాప్రతిభ ఆ యా సూత్రాలను అనుసరించటంవల్ల ప్రాప్తించటం లేదు. కేవలం ఉద్బుద్ధావస్థలో ఉండి ఆ రమణీయ శ్లోకాలు, గీతాలు ఆలాపిస్తున్నారు. నిజంగా ఆ స్థితిలో వారిని ఏదో ఒక దేవత ఆవేశించి పలుకుతున్నట్లుగా ఉంటుంది. ఈవిధంగా కవులు 'దివ్యోన్మాదావస్థ'లో ఉండి తమ కావ్యాలను గానం చేస్తున్నారు.

ఇలాంటి అతిలోకోద్బుద్ధావస్థలో ఉండి లయసామరస్యాలచే (Rhythm Harmony) ప్రేరితులై వాటిని మనకు అందజేస్తున్నారు. కవులు చెబుతున్నట్లుగా వారి ఆత్మలు పూవుపూవునకు తుమ్మెదలవలె పోతూ, ఆరామశాద్వలాదిస్థలాలలో సంచరించి దివ్యసుధా నాదసానువులందు మునిగి గానమాధుర్యం కొనివస్తాయి. భావనామహిమాన్వితులై వారు సత్యం చెబుతారు. కవికి అతిలోకలాఘవ మున్నది, రెక్కలున్నాయి. అతడు దివ్య ప్రకృతిసంపన్నుడు. ఉద్బుద్ధుడు కానంతవరకు, దివ్యోన్మాదం ఆవేశించనంతవరకు, వివేకం ఉన్నంతవరకు అతడు కవితాశబ్దవాచ్యమైన సృష్టి చేయలేడు. వివేకంలో యత్కించిదంశ మున్నా అతడు కవిత్వం చెప్పటానికి ఏమాత్రం సమర్థుడు కాడు. హోమర్ మొదలైన కవుల కృతులను గానంచేసేవారు, నటకులుకూడా వృత్తివల్లగాని, శిక్షణవల్లగాని ఆ రామణీయకం అభివ్యక్తం చేయలేరు. ఆ దివ్యోన్మాదం ఎంత గాఢంగా ఉంటే, సరస్వతి ఎంతగా ఆవేశిస్తే కవిగాయకనటుల కవితాగానాదుల రామణీయకం అంత ఉదాత్తంగా ఉంటుంది. ఇతరవిషయాలలో కవులు అజ్ఞానులు, అసమర్థులు కావచ్చును. ఎందుకంటే నేర్చిన వృత్తివిద్య ననుసరించి వారు కవిత్వం చెప్పటంలేదు. కేవలం దివ్యోన్మాదప్రేరితులై పలుకుతున్నారు. విమర్శనసూత్రాల ననుసరించి ఏ ఒకవిషయం మీదనైనా హృదయంగమంగా పద్యాలు చెప్పగలిగితే ఆ సూత్రాలచే ఇతరవిషయాలకు కూడా అన్వయించి మనోజ్ఞకవిత్వం చెప్పవచ్చును. కాని అలాంటిది జరగటంలేదు. చూడగాచూడగా ఈశ్వరుడు తన సందేశాలను లోకానికి వెల్లడించటంకోసమని కవులను, ప్రవక్తలను, జ్యోతిష్కులను, ఉద్దేశపూర్వకంగానే బుద్ధి వివేకాలనుమాత్రం కూడ లేకుండ చేసినట్లు కనిపిస్తున్నది. ఉత్తమోత్తమ కావ్యాలు,కృతులు మనుష్యమాత్రకృతాలు కావు; దైవదత్తాలని ఈశ్వరుడు రుజువుచేస్తున్నట్లు కనిపిస్తున్నది. కాబట్టి కవిచిత్రకారాదులు దేవతలకు వ్యాఖ్యాతలు. ప్రతికవి ఒకానొక దేవతచే ఆవిష్టుడౌతాడు.

ఇంతకుముందు అయస్కాంతాకృష్టశలాకా పరంపరనుగూర్చి చెప్పుకొన్నాము. ఆ పరంపరలోని కడపటి లంకె సహృదయుడు; నడిమిలంకె కావ్యగానం చేసేవారు, నటకులు; మొదటి లంకె కవి.

## సుఖదుఃఖాల తత్త్వం

ఇంతవరకు కళాసృష్టిసంగతి చూచాము. ఇక కళానుభూతి, అంటే కళాసృష్టియొక్క రూపాదికం గోచరించినప్పుడు కలిగే అనుభవం ఎలా ఉంటుందో చూదాము. దీని సంగతి విచారించేముందు సుఖదుఃఖముల స్వరూపాన్నిగూర్చి ప్లేటో అభిమతం తెలుసుకోవాలి.

అతని మతం ప్రకారం నశ్వరము, జడమైన శరీరం, అనశ్వరము చేతనమైన ఆత్మ వేరువేరుగా ఉన్నాయి. వాటి ననుసరించి సుఖదుఃఖాలు కూడా మూడు భాగాలవుతున్నవి: శారీరకములు, మానసికములు, ఉభయములు. ఆత్మ యథార్థమూ, శరీరం అయథార్థమూ అయినట్లు ఈ సుఖదుఃఖాలుకూడా యథార్థాలు, అయథార్థాలు అవుతున్నవి.

ఈ విభాగం సంగతి తరువాత చూదాము. అసలు సుఖం కాని దుఃఖం కాని ఎలా కలుగుతున్నవి? శరీరంలోని వివిధ పదార్థాలు ఒక నిర్దిష్ట నిష్పత్తిలో ఉంటాయి. ఇలా నిర్దిష్టనిష్పత్తిలో ఉండటమే సామరస్యము. ఈ సామరస్యం చెడినప్పుడు దుఃఖము కలుగుతుంది. ఉదాహరణకు ఒక చిన్న విషయం తీసుకొందాము. శరీరంలో జలం కొంత ఉంటుందికదా. ఆ ఉన్నకొంతలో కొంత క్షీణిస్తుంది. అప్పుడు మనకు దప్పి అవుతుంది. ఈ విధంగా సామరస్యం చెడటంవల్ల, అంటే జలక్షీణతవల్ల దుఃఖం కలుగుతున్నది. ఈ సామరస్యం తిరిగి నెలకొనటానికి మంచినీరు త్రాగుతా మనుకొండి. అంటే జలపూరణం చేస్తున్నాము. దీనివల్ల సుఖం కలుగుతున్నది. ఇలాగే శీతోష్ణాదులందుకూడా క్షీణతవల్ల దుఃఖము, పూరణంవల్ల సుఖము కలుగుతున్నాయి. ఈ సుఖదుఃఖాలు శరీరంవల్ల కలుగుతున్నా ఈ జ్ఞానం మనస్సుమాత్రమే పొందగలుగుతున్నది. ఈ సుఖదుఃఖాలకు సాక్షాత్తుగా నిమిత్తం శరీరం కావటంవల్ల వీనిని శారీరకా లంటున్నాము.

ఇక మానసిక సుఖదుఃఖాల సంగతి పరిశీలింతాము. శరీరంలోని సామరస్యం ఇకముందు చెడుతుందని మనస్సు ఊహిస్తే అది దుఃఖం.

చెడిన సామరస్యం కోలుకుంటుందని ఊహిస్తే అది సుఖం. ఇలా సామరస్యపూరణక్షీణతల ఊహలు మానసిక సుఖదుఃఖాలు అవుతున్నాయి.

ఇంతవరకు చెప్పుకొన్న దానినిబట్టి సుఖదుఃఖాలనేవి సామరస్య పూరణక్షీణతలమీద ఆధారపడుతున్నవని తేలిపోయింది. ఈ సిద్ధాంతాన్ని అనుసరించి దుఃఖరాహిత్యం సుఖం కాదని నిష్పన్నమవుతున్నది. పైగా సుఖదుఃఖవిరహితావస్థకూడా ఒకటి ఉన్నట్లు సిద్ధిస్తున్నది. ఎందుకంటే, సామరస్యం చెడినప్పుడు దుఃఖము, తిరిగి కోలుకొన్నప్పుడు సుఖము కలుగుతున్నవి. సామరస్యం యథాప్రకారంగా ఉంటున్నప్పుడు ఎలాంటి అవస్థ ఏర్పడుతుంది ? అది సుఖమూ కాదు, దుఃఖమూ కాదు. కాబట్టి సుఖ దుఃఖవిరహితమైన మధ్యస్థఅవస్థ కావాలి. ఇలాంటి తటస్థావస్థ, లేక మధ్యస్థావస్థ వివేకచోదితమైన జీవితంలో గోచరిస్తుంది.

అయితే జీవితంలో సుఖదుఃఖాలు, తదభావం వేనికవిగా విడివడి ఉండవు. ఉదాహరణకు మనం ఊరికి నడిచివెళ్ళుతుంటామనుకోండి. నడి వేసవికాలం, నాలుక ఆర్చుకపోతూ ఉంటుంది. ఈ నాలుక ఆర్చుక పోవటం శారీరక దుఃఖమేకదా ! అయితే మనస్సులో అదే సమయంలో ఒక ఆశ అంకురించవచ్చును. ఇంకా నాలుగడుగులు ముందుకు వేస్తే మంచి నీళ్ళబావి వస్తుంది. ఆ నీరుకూడా దివ్యం. దప్పిక తీరిపోతుందనుకోవచ్చును. ఇలాటి ఆశ, లేక ఊహవల్ల సుఖం కలుగుతున్నది. ఈ విధంగా ఒకే సమయంలో శారీరకంగా దుఃఖమూ, మానసికంగా సుఖమూ కలుగుతున్నాయి. జీవితంలోకలిగే అనుభవాలలో ఎక్కువభాగం ఇలాంటి సమ్మిశ్రితములే. ఎందుకంటే, ఇవి కేవలం సుఖాలు కావు; కేవలం దుఃఖాలు కావు.

## సుఖదుఃఖాల యథార్థాయథార్థత్వం

పైదానినిబట్టి మిశ్రిత సుఖం కాని, మిశ్రితదుఃఖం కాని ఏర్పడటానికి వీలున్నదని చూచాము. అయితే ఇలా ప్రతిద్వంద్వితో అనుసరింపబడు తున్న సుఖం కాని, దుఃఖం కాని యథార్థమా? ఎందుకంటే ఒకే కాలంలో పరస్పరవిరుద్ధ అనుభవాలు కలుగుతున్నవి కదా. ఇలా కలుగుతున్న ద్వంద్వంలో

ఏది యథార్థం ? ఏది అయథార్థం ? లేక రెండూ యథార్థాలా ? లేక రెండూ అయథార్థాలా ?

మానవుడు ఉన్మాదావస్థలో ఉన్నా, జాగ్రదవస్థలో ఉన్నా, స్వప్నావస్థలో ఉన్నా, ఆ అనుభవిస్తున్నది సుఖమైనా దుఃఖమైనా యథార్థమే అనవచ్చును. ఒకనికి ఒక అభిప్రాయం ఉన్నదనుకొందాము. ఆ అభిప్రాయం యథార్థమైనా కాకపోయినా అభిప్రాయం కాకపోదు. అలాగే సుఖంకూడా యథార్థమైనా కాకపోయినా సుఖమే. అలాగే దుఃఖం. కాబట్టి సుఖదుఃఖవిషయంలో యథార్థతాయథార్థతల ప్రశ్నే రాదనవచ్చును.

కాని సుఖం సంగతి చెప్పవలసివచ్చినప్పుడు అల్పమనీ, ఉత్కృష్టమనీ విశేషణాలతో పేర్కొంటున్నాము. అలాగే యథార్థము, అయథార్థము అన్న విశేషణాలనుకూడా చేర్చటానికి వీలులేదా ? ఒక విషయాన్ని మరొక విషయమని అభిప్రాయపడినప్పుడు అది అయథార్థాభిప్రాయమంటున్నాము. అలాగే సుఖానికి విషయమైనదానిలో పొరపడినప్పుడు ఆ సుఖాన్ని అయథార్థసుఖమనుకూడా అనకూడదా ? ఈ ప్రశ్న ఒక దృష్టాంతంతో తేలికగా బోధపడుతుంది. ఎన్నికలు జరుగుతుంటాయి. ఒకవ్యక్తి ఏ ఒక ప్రత్యేకపక్షమూ నెగ్గితేనే దేశానికి మేలుకలుగుతుందని నిశ్చయించుకొంటాడు. ఆ పక్షం ఎన్నికల్లో నెగ్గగానే సంతోషిస్తాడు. కాని ఆపక్షం అతడు ఆశించినదానికి కేవలం విరుద్ధంగా వ్యవహరిస్తుందే ననుకొందాము. అలాంటప్పుడు అతని సుఖం అయథార్థం కాదా ?

కాబట్టి సుఖదుఃఖాలకు యథార్థతాయథార్థతలు ఉంటున్నాయి. ఉన్నప్పుడు వాని యథార్థతాయథార్థతలు దేనిమీద ఆధారపడుతున్నవి ?

ఇంతకుముందు మానసిక సుఖదుఃఖాలు మనోనిశ్చయం (Judgement) మీద ఆధారపడుతున్నవని చెప్పుకొన్నాము. ఈ నిశ్చయం యథార్థమైతే దానివల్ల కలిగే సుఖదుఃఖాలుకూడా యథార్థాలు; అయథార్థమైతే అవికూడా అయథార్థాలు. ఇంతకూ నిశ్చయం ఎలా కలుగుతున్నది ? దాని యథార్థతాయథార్థతలు ఎలా ఏర్పడుతున్నాయి ?

ఆత్మలో కామాంశం ఉందని చెప్పుకొన్నాం. అంటే మనస్సు అని చెప్పుకొనేదానిలో రతిక్రోధ భయవిశ్వాసాదివాసనలు, సంస్కారాలు ఉన్నాయి. ఇలాంటి మనస్సుకు ఐంద్రియికశక్తి, స్మరణశక్తి, వికల్పనశక్తి ఉన్నాయి. వస్తువులను ఇంద్రియాలతో చూస్తాము. అలా కలిగిన జ్ఞానం స్మృతిపథంలో ఉంటుంది. మనలోని వాసనలను పురస్కరించుకొని స్మృతి పథంలో నిలిచిఉన్న ఐంద్రియిక జ్ఞానానికి వికల్పనశక్తి ఒక నిర్దిష్టరూప మిచ్చినప్పుడు నిశ్చయ మేర్పడుతున్నది. ఈ విధంగా ఐంద్రియికజ్ఞాన స్మృతి వాసనా సంస్కారసమ్మేళనంతో నిశ్చయ మేర్పడుతున్నది. ఇంద్రియజ్ఞానం ప్రమ కాదని లోగడ చెప్పుకొన్నాము. కాబట్టి ఇంద్రియ జ్ఞానాన్ని పురస్కరించుకొని యేర్పడే నిశ్చయమంతా అయథార్థం. అలాంటి అయథార్థనిశ్చయంవల్ల కలిగే సుఖదుఃఖాలుకూడా అయథార్థాలు.

ఈవిధంగా లేనిపోని ఉజ్జ్వలభవిష్యం రాగలదన్న అయథార్థనిశ్చయంతో అయథార్థసుఖం పొందవచ్చును. అయథార్థమైన గతవిషయాలను స్మరించుకొని, దానివల్ల కలిగిన అయథార్థనిశ్చయంతో అయథార్థసుఖం పొందవచ్చును. వర్తమానవిషయాలు ఒకవిధంగా ఉంటే మరొకవిధంగా ఉన్నాయన్న అయథార్థనిశ్చయంతో అయథార్థసుఖం పొందవచ్చును. ఇలాగే అయథార్థదుఃఖంకూడా.

సుఖదుఃఖాల అయథార్థతకు నిశ్చయదోషమే కాక మరొక కారణం కూడా ఉంది. సుఖము,దుఃఖము ఒకేసారి కలగడానికి వీలున్నదనిచూచాము. ఒకటి శరీరంద్వారా కలిగేది. రెండోది మనస్సుద్వారా కలిగేది. ప్రకృతం శరీరం రోగపరిపీడ్యమానం అనుకొందాము. ఈబాధ ఒక ప్రక్కన మున్ముందు ఆరోగ్యం కలుగుతుందన్న ఆశతో కలిగే సుఖం మరొకప్రక్కన ఉంటాయి. ఇప్పుడు కలుగుతున్న బాధముందు రేపు కలగబోయే సుఖం ఎంత ఉత్కృష్టమైనా చాలా అల్పంగా కనిపిస్తుంది. అందువల్ల బాధ ఉన్న దానికంటె ఎక్కువగా కనిస్తుంది. ముందువచ్చే ఆరోగ్యంవలని సుఖం తీరా ప్రాప్తించినప్పుడు ఆ సుఖపరిమాణం ఎంతో పెరిగినట్లు కనిపిస్తుంది. కాబట్టి మనం పొందే సుఖదుఃఖాలలో కొంతయాథార్థ్యం, కొంతఆభాసం

ఉంది. ఈ ఆభాసాంశం తీసివేస్తే వాటి యథార్థపరిమాణాలు తేలుతాయి. కాని అనుభవంలో అలాంటిది సాధ్యపడదు.

సుఖదుఃఖాల అయథార్థతకు ఇంకొక కారణం కూడా ఉంది. శరీర సామరస్యం యథాప్రకారంగా కొనసాగుతున్నప్పుడు సుఖమూ దుఃఖమూ కాని అవస్థ ఉంటుంది. శరీరసామరస్యంలో జరిగే పూరణక్షీణతల పరిమాణం తగినంతగా ఉంటేకాని మనోగోచరం కాదు. అలా తెలిసివచ్చినప్పుడే సుఖమో దుఃఖమో అనుభూతమౌతున్నది. పూరణక్షీణతలు అంత పరిమాణంలో లేనప్పుడు తటస్థావస్థ ఏర్పడుతున్నది. ఇలాంటి తటస్థ సంవేదనను సుఖమనో, దుఃఖమనో అనటం జరుగుతున్నది. నిజానికి ఈ సంవేదనం దుఃఖమూ కాదు, సుఖమూ కాదు.

గాఢతీవ్రసుఖాలు వ్యాధిగ్రస్తునకే. ఆ వ్యాధి మానసికమైనా శారీరకమైనా అతనికే. ఇలాంటి గాఢతీవ్రసుఖాలన్నీ దుఃఖసమ్మిశ్రితాలే. ఈసమ్మిశ్రితసుఖాలు శారీరకాలు కావచ్చును; లేదా మానసికాలూ కావచ్చును; లేదా ఉభయాలూ కావచ్చును.

శారీరకమూ, ఉభయమూ అయిన సమ్మిశ్రితసుఖాలను గూర్చి లోగడ చెప్పకున్నాము. కేవలం మానసికాలైన సమ్మిశ్రితసుఖాలను పరిశీలించాలి.

## కేవల మానసిక సమ్మిశ్రితసుఖాలు

మనస్సులో రతిభయశోకక్రోధద్వేషస్పర్ధాది వాసనలున్నాయి. ఇవన్నీ మానసికదుఃఖం కలిగించేవే. అంటే ప్రబుద్ధమైనప్పుడు దుఃఖం కలిగిస్తాయి. ఇవి తుష్టిపొందినప్పుడు అత్యధికసుఖం కలుగుతుంది.

పిల్లవాడు ఏదో చెడ్డపని చేస్తాడనుకోండి. అప్పుడు ఎక్కడలేని కోపం వస్తుంది. అంతవరకు అది బాధ. పిల్లవాణ్ణి గట్టిగా మందలించో, కొట్టో మనం కోపం తీర్చుకొంటామనుకోండి. బాధకలిగిస్తున్న ఆకోపమే సుఖం కలిస్తుగింది. అలాగే ఏ ప్రహసనమో, లేక హాస్యరసప్రధానమైన మరొక రూపకమో చూస్తామనుకోండి. అప్పుడుకూడ ఇలాంటి మిశ్రిత సుఖమే కలుగుతుంది. ఇలా అనగానే ఆశ్చర్యం కలుగక మానదు.

అసలు తత్త్వం అర్థం కాదు. అనపాయకరమైన ఆత్మవంచనం గోచరించి నప్పుడు నవ్వు వస్తుందన్నాము. ఈ గోచరత మనస్సులోని ఏ వాసనను శమింపజేస్తున్నది? ద్వేషాన్ని. కాబట్టి ద్వేషం ప్రబుద్ధమైనప్పుడు దుఃఖము కలుగుతున్నది; శమం పొందినప్పుడు సుఖం కలుగుతున్నది. ఈ రెండు వ్యాపారాలూ ఒకే కాలంలో కలుగుతున్నవి కాబట్టి హాస్యం కూడ దుఃఖసమ్మిశ్రిత సుఖమే *

కాగా వాసనాప్రబోధంతో దుఃఖమూ, శమంతో సుఖమూ ఏక కాలమందే కలుగుతున్నవి. ఈ సూత్రం సాహిత్య జగత్తుకే కాక వ్యావహారిక జగత్తుకుకూడా అన్వయిస్తుంది. ♦

ఇంతవరకూ పరిశీలించినవన్నీ అయథార్థ సుఖదుఃఖాలే. అసలు యథార్థసుఖాలు అనేవి ఉన్నవా, లేవా? ఉంటే అవి ఎలా ఉంటాయి?

---

* ఒకపాత్రగాని, సన్నివేశంగాని, కథగాని హాస్యాస్పదంగా ఉండాలంటే అది ఇష్టమైనది (Likeable) కావాలి. లేకపోతే హాస్యానికి తావులేదని ప్లేటో ఘంటాపథంగా చెబుతున్నాడు. ఇదే అన్ని సాహిత్యాలలోను గోచరిస్తుంది. మృచ్ఛకటికంలోని శకారుడు, సంస్కృత నాటకంలోని విదూషకుడు, షేక్స్పియర్ సృష్టించిన ఫాల్‌స్టాఫ్, ప్రతాపరుద్రీయంలోని పేరిగాడు, కన్యాశుల్కంలోని గిరీశం మొదలైనవారు దృష్టాంతం.

♦ ఈ సందర్భంలో మరొక విషయం పేర్కొనటం అప్రస్తుత ప్రశంస కాదనుకొంటాను. కేవల మానసికసమ్మిశ్రిత సుఖాలన్నిటికి శమం మూలమని ప్లేటో అంటున్నాడు. సాధారణకావ్యాది కానందానుభూతి నంతా సమ్మిశ్రితసుఖంక్రింద పరిగణిస్తున్నాడు. కాబట్టి సాహిత్యదర్పణ కారుడు అద్భుతం సర్వరసాలకు అంతర్వ్యాపి అంటున్నట్టే ప్లేటో శమము సర్వరసాలకు అంతర్వ్యాపి అంటున్నాడు. అంతేకాదు. సర్వ మానసిక సుఖాలకు ఆతని మతంలో శమమే—క్షీణతాశబ్దంతో లోగడ పేర్కొన్న అర్థమే-కారణం. కాబట్టి ప్లేటోమతం ప్రకారంకూడా శాంతం రసరాట్టు అవుతున్నది.

వేనివల్ల కలుగుతాయి? అసలు సుఖమన్నది శరీరసామరస్య పూరణంవల్ల కలుగుతుందనీ దుఃఖం క్షీణతవల్ల కలుగుతుందనీ చూచాము. ఈ క్షీణత మనస్సుకు గోచరించనంత అల్పంగా ఉన్నప్పుడు దుఃఖం ఉండదు. సామరస్యపూరణం మనోగోచరమైనప్పుడు సుఖం కలిగిస్తుంది. ఇలాంటివే కేవల యథార్థ అసమ్మిశ్రితసుఖాలు లేక ఆనందాలు (?); రమణీయాలైన రంగులు, ఆకృతులు, ధ్వనులు, కొన్ని సుగంధాలు (ఆహారపానీయాదికముల వాసనలు, “మనువహాలుపు దెలుపు మారుతము” మొదలైనవి వినా) ఇలాంటివి ఆనందం కలిగిస్తాయి.

అయితే ఆకృతులను రమణీయమంటున్నామంటే ఆ రామణీయకం శరీరచిత్రాదుల రామణీయకం వంటిది కాదు. శరీరచిత్రాదుల రామణీయకం సాపేక్షం; పురస్సరద్వాంఛం, అన్యప్రయోజనం. కేవల ఆకృతిమాత్రరమణీయాలైన దీర్ఘచతురస్రాల, గోళాల, త్రిభుజాల రామణీయకం విశిష్టం. ఈ రామణీయకం సాపేక్షంకాదు. స్వభావతః ఇవి నిత్యరామణీయాలు. ఇలాగే స్పష్టములు, లలితములు, అక్లిష్టములు అయిన ధ్వనులు నిరపేక్షతా నిత్యరమణీయాలు. పైని పేర్కొన్న గ్రంథాలుగూడా రమణీయాలే కాని అంత ఉదాత్తాలు కావు. అయినా వీటివల్ల కలిగేదికూడా ఆనందమే.

ఈ ఆనందంలో మరొకవిధమైన ఆనందం ఉన్నది. అర్థజ్ఞానం (Learning) లేక శాస్త్రజ్ఞానంవల్ల కలిగే ఆనందం ఇందులో చేరుతుంది. క్షుత్పిపాసాదులందువలె మొదట దుఃఖంకలిగి దాని నివారణంవల్ల సుఖం కలుగుతున్నట్లుగా ఈ జ్ఞానాభావంవల్ల దుఃఖం కలగటంలేదు. సంపాదించిన ఈ జ్ఞానం మరచిపోతున్నప్పుడు దుఃఖం కలుగటంలేదు. మరచిపోయానే అన్న పరామర్శంవల్ల దుఃఖం కలిగితే కలగవచ్చును. అది వేరేసంగతి. కాని స్వతః అర్థజ్ఞానం లేక, శాస్త్రజ్ఞానం ఆనందం కలిగిస్తున్నది.

ఆనందంలోని ఈ రెండురకాలలో ఏది ఉత్తమం అనే విషయంలో ప్లేటో తన అభిప్రాయాన్ని వెల్లడించక ముభావంగా ఊరుకొన్నాడు

ఇంతవరకు సుఖదుఃఖస్వరూపపర్యాలోచన జరిగింది. ఆనందము, క్షుత్పిపాసాది స్వాభావికతృష్ణల నివారణంవల్ల కలిగే సుఖము, నైతికప్రవ

ర్తనసంజనిత సుఖము అన్న మూడు అంశాలతో గూడినదే ధర్మం. ఈ ధర్మం రామణీయకం, నిష్పత్తి ( proportion ), సత్యమూ అన్న మూడు "భావాలచే" అభివ్యక్తమౌతుంది. అంటే రామణీయకంలోను, నిష్పత్తి లోను, సత్యంలోను ధర్మ ముంది. ఇలాగే రామణీయకంలో నిష్పత్తి సత్యం ధర్మం ఉన్నాయి. ఇలాగే సత్యం నిష్పత్తి కూడా.

రామణీయకమంటే మితత్వం, నిర్దిష్ట నిష్పత్తి అంటూ ప్లేటో దానిని ధర్మంతో ముడివేశాడు. అందువల్ల అతని మతం ప్రకారం వికళితధర్మ మైన రామణీయకం లేదు. ఒకటి రమణీయ మంటున్నామంటే అతని మతం ప్రకారం అది ధార్మికమూ కావాలి. అంతేకాని కళ కళకోసమే నన్న వాదన అతడు ఏమాత్రం అంగీకరించడు

కాబట్టి కళ ధర్మబోధకం కావాలి. అయితే కళ ఎలాటి ధర్మోపదేశం చేయాలంటున్నాడో తెలిసికోవటం అవసరం.

## కళ – ధర్మం

కళాసృజనక్రియకు ఏది ఉద్బోధకమో, ఆ సృష్టిస్వరూపము, సత్తా ఎలాంటిదో, దానివల్ల ఎలాంటి అనుభవం కలుగుతున్నదో చూచాము. కళాసృష్టి పారమార్థికసత్యం కాదు. ఇది ప్రతిబింబానికి ప్రతిబింబం (కేవలం సాక్షిభాస్యం). కాబట్టి పారమార్థికసత్యమైనభావాలు లక్ష్యాలు తత్ జ్ఞానసిద్ధికోసం పాటుపడటం జీవిధర్మం. అందువల్ల లోకంలోని ప్రతిదీ ప్రయోజనకారి కావాలి. కళాసృష్టికూడ ప్రయోజనకారి, అంటే మానవుని పరమార్థసిద్ధికి వినియోగ పడాలి. అంతకు తప్ప ఇది తనకు తాను పరమార్థం కాదు. కాబట్టి సాహిత్యాదికం పరమార్థబోధకంగా ఉండాలి కాని తానే పరమార్థ మైనట్లుగా తన యందే సర్వం లీనమైపోయేటట్లు ఉండకూడదు. అంటే ఇది ధర్మోపదేశకం కావాలి.

కవులు గానంచేసేకథలు పూర్ణంగా సత్యవర్జితాలు కాకపోయినా ప్రధానంగా కల్పితాలు. * పిల్లల మనస్సులు లేతవి. ఏమిచెప్పినా వారి హృదయకుహరంలో హత్తుకొనిపోయి వారిశీలంమారుస్తుంటాయి. అందువల్ల

* Republic, Chap. 3.

రమణీయకృతి నిర్మాపకుడు కాలేడు. వ్యుత్పత్తి, అభ్యాసము, నైపుణి ప్రధానాలే అయినా వీటికంటె అత్యంత ముఖ్యమైనది మరొకటి ఉంది. శ్రుతి లగించగలిగినంత మాత్రాన వైణికుడు కాడు. కావ్యాలు, కోశాలు, ఛందోలంకారశాస్త్రాలు చదువుకొన్నంతమాత్రాన కవి కాడు. ప్రతిభ అనేది ఒకటి అవసరం. ప్రతిభాసముపపన్నుడైనప్పుడే అది సృష్టిఅవుతుంది.

## అలౌకిక రామణీయకం - లౌకిక రామణీయకం

ఈ పర్యవలోకనంతో అలౌకిక రామణీయక స్వరూపం, లౌకిక రామణీయకస్వభావం తేలిపోయింది. అయితే ఈ రెంటికీవున్న సంబంధమేమిటి? ఈ ప్రశ్నకు ఒకవిధంగా ఇదివరకే సమాధానం చెప్పుకొన్నాం. తిరిగి చెప్పటం పునరుక్తే అయినా స్పష్టతకోసం గతార్థస్మరణం అనవసరం కాదు.

లౌకిక రమణీయార్థాలు తమకుతాము ప్రయోజనకారులు కావు. ఈ అర్థాలు అలౌకిక రామణీయకానికి ప్రతిబింబాలై ఆ పరమరామణీయకాభివ్యంజకములైనప్పుడే అవి సార్థక్యము పొందుతున్నవి. పారమార్థిక రామణీయకాభివ్యంజనమే వాటి ప్రయోజనం. "మానవుడు ఈ భౌతికరమణీయార్థాలతో ఆరంభించి పారమార్థిక రామణీయకాభిముఖగమనానికి వీనిని సోపానాలుగా వాడుకొంటూ, ఒకటినుంచి రెండికి, రెంటినుంచి అన్నిటికీ, అక్కడనుంచి రమణీయ జీవులదగ్గరకు, వాటినుంచి రమణీయజీవితాలకు, వాటినుంచి రమణీయసత్యాలకు, వాటినుంచి తుదకు రామణీయకం యొక్క యథార్థజ్ఞానానికి పురోగమిస్తాడు. ఈ విధంగా కట్టచివరకు రామణీయక మేమిటో తెలుసుకొంటాడు ఈ రామణీయకమే యథార్థమైన ఆలయం. ఇక్కడ పారమార్థిక రామణీయక దర్శనం లభిస్తుంది. తన జీవితంలో మానవునికి ఆలయమనేది ఒకటి ఉంటే ఇదే అతని ఆలయం!"*

లౌకిక రామణీయార్థాలు పుడుతుంటాయి; గిడుతుంటాయి; పరిణామం పొందుతుంటాయి. ఇవి ఒకనికి, ఒకదేశానికి, ఒక కాలానికి రమణీయాలై మరొకనికి, మరొకదేశానికి, మరొక కాలానికి రమణీయాలు కావు. అయితే ఇవి పరమ రామణీయకాభివ్యంజకములైతే, తాను చెప్పే నైతిక వ్యవస్థ, సామాజికవ్యవస్థ అభివ్యక్తంచేస్తే ప్లేటోకు ఎలాంటిఆక్షేపణలేదు.

* Symposium.

అలా గాక కేవలం భౌతిక విషయాభివ్యంజకమై తేమాత్రం అతడు సహిం చడు. అలాంటివాటిని బహిష్కరించటానికి, అణచివేయటానికి ఏమాత్రం సంకోచించడు. రిపబ్లిక్‌లో అంత తీవ్రనిరాసానికి పాల్పడింది ఇలాంటి రమణీయార్థాలేగాని పారమార్థిక రామణీయకం కాదు. తదభివ్యంజక రమణీయార్థాలు గావు. ఈ లెక్కలో మహాకవుల కృతులలో ముప్పాతిక మువ్వీసం పరిహరణీయ మౌతుంది. అయినా అలా వర్జించటానికి ప్లేటో ఏ మాత్రం సంకోచించడు. అతనికి ప్రజాసామాన్యంయొక్క ఇష్టానిష్టాలతోను, అభిరుచులతోను సంబంధం లేదు. తనశాస్త్రం చెప్పినట్లు లోకం ఉండాలి. ఉండకపోతే ఉండేటట్లు చేయాలి.

కళాస్రష్టలు రమణీయాలయినా భౌతికాలు. అందులో ఆభాసమైన భౌతికార్థానికి ఆభాసాలు. అందువల్ల వృత్తికారులకన్నా కళాస్రష్టలు క్రిందిమెట్టు లోనివాళ్ళు. కళాస్రష్టకన్నా సహృదయుడు ఉత్తముడు. సహృదయునికంటె రామణీయకతత్త్వ విచారపరుడు ఉత్తమోత్తముడు. ఇది ప్లేటోమతం. ఈమతం కేవలం దురభిమానం పురస్కరించుకొని వెలువడి నది కాదు. అతడు సిద్ధాంతీకరించిన జ్ఞానస్వరూపాన్నిబట్టి నిష్పన్నమౌతు న్నది. అతడు ప్రతిపాదించిన జ్ఞానస్వరూప మంగీకరిస్తే ప్రతి కళాస్రష్ట అనుకారి. అతనిసృష్టి అనుకృతి. అలా కాక జ్ఞానస్వరూపంవరకు అంగీక రించి కళాస్రష్టను అనుకారి అంటే నొచ్చుకోవలసిన అవసరంలేదు. ప్లేటో ఇక్కడ తికమకపడ్డాడు. స్వవచనవ్యాఘాతం చేసుకొంటున్నాడు అంటే ప్రయోజనం లేదు. *

* కీర్తిశేషులైన ఏ. కె. కుమారస్వామిగారు Figures of Speech or Figures of Thought అన్నవ్యాసంలో ప్లేటోఅనుకరణవాదాన్ని అత్యంత సమంజసంగా అనువదించారు. ఈ అనుకరణవాదం ప్లేటోనిక సిద్ధాంతమని గుర్తించినట్లు చూసినవల్ల జీవితంలో కళకు ఎలాంటి స్థానం లభి స్తున్నదో, పురాణాలు, ఇతిహాసాలు, కాళిదాసాది మహాకవుల కొన్ని కృతులు, లేక అందలి కొన్ని భాగాలు ఎలా కళాఖండాలు కాకుండా పోతున్నవో, ధర్మమనేది ఎలా ప్రయోజనాపేక్షకమై ఘోరంగా తయార వుతుందో చెప్పకుండా చక్కగా జారవిడిచారు.

ఏది ఏలా ఉన్నా ప్లేటో కళాసిద్ధాంతం ముఖ్యంగా మూడుసూత్రాల మీద ఆధారపడివుంది.

1. అనుకరణవాదం. ఈవాదం కేవలం దార్శనికం (Metaphysical). ఇది బొశాంక్ చెప్పినట్లు కళయొక్క యాథార్థ్యాన్ని, విలువను ఏమాత్రం అంగీకరించదు.

2. కళ ధర్మప్రతిపాదకం కావాలి. ఇలా అనటంలో రెండు విశేషార్థా లున్నాయి. ఒకటి — జగద్వ్యవస్థలో స్వయంప్రకాశమానము లైన శక్తుల ధార్మికవ్యవస్థను కూడా చిత్రిస్తూ కళ గంభీరము, పూర్ణము కావాలి. రెండు — యథార్థరామణీయకం, అయథార్థరామణీయకం ఉన్నవని ఈ సిద్ధాంతంలో అంతర్భూతమై ఉంది. అయథార్థరమణీయ వస్తువులు కేవలం భౌతికప్రయోజనమే పరమార్థంగా బయలుదేరేవే కాబట్టి గర్హణీయాలని యీవాదం భావిస్తుంది. ఈ సందర్భంలో ప్లేటోమతం ప్రకారం పారమార్థికం, ప్రయోజనసహితం అయినదే ధర్మమనిమాత్రం మరిచిపోగూడదు.

3. భిన్నత్వంలో ఏకతను ఇంద్రియగోచరం కావించటంలోనే రామణీయకముంది. పై రెండు సూత్రాలకంటె ఇది అత్యంత ముఖ్యం, యథార్థం. దీనివల్లనే కళాసృష్టికి సంపూర్ణత్వం, ఏకత్వం, అనన్యత్వం, నిత్యత్వం సిద్ధిస్తున్నాయి.

## ఉపసంహారం

ఇంతవరకు ప్లేటో కళాసిద్ధాంతం పరిశీలించాము. అతని మతం క్లుప్తంగా చెప్పుకోవాలంటే ఇలా ఉంటుంది.

మానవజీవితమంటే తనలో లేని ఒకానొక దివ్యపదార్థంకోసం సాగించే నిరంతర అన్వేషణ. ఈ దివ్యపదార్థం జన్మపరంపరకు అవల దేశకాల అతీతమై, అనన్యమై ప్రకాశిస్తూ ఉంటుంది. ఈ దివ్యపదార్థ సాక్షాత్కారసిద్ధే మానవజీవితానికి పరమార్థం. ఈ దివ్యపదార్థాన్నిబట్టిచూస్తే యీ సదసత్ప్రపంచమంతా మిథ్య. జీవికి ముక్తి జీవయాత్రాంతర్గత అన్వేషణద్వారానే లభిస్తుంది. అంతేకాని మానవజీవితం స్వతః ప్రయో-

జనకారికాదు. పరమార్థానికి సాధనంగామాత్రమే దీనికి ప్రయోజనం ఉంది. అందువల్ల తత్త్వాన్వేషణం ఉత్తమం. ఇలాంటి తత్త్వాన్వేషణకు సోపానమైనదే కళ. అందువల్ల కళ తత్త్వశాస్త్రంకంటె న్యూనం. జిజ్ఞాసను, పర్యుత్సుకతను తోడ్పడనిది కళకాదు. అలా తోడ్పడని కళ నీచాతినీచము.

అయితే ప్లేటోవాదాన్ని పరిశీలించినవారికి ఈ క్రింది ప్రశ్నలు కలుగుతాయి. ౧. ప్రత్యక్షం ప్రమకాదా? పర్వతం భిన్నభిన్నదూరాలలో నుంచి చూచినప్పుడు భిన్నభిన్న పరిణామకృతులు గోచరిస్తున్నంత మాత్రాన ఆ భిన్నభిన్న జ్ఞానాలు అయథార్థాలా? ఏనుగు పర్వతంకంటె చిన్నదై లేడికంటే పెద్దదైనంతమాత్రాన అంతర్వైరుధ్యముందా? ౨. ప్లేటో ప్రతిపాదించిన పరిణామనిరాసం సమంజసంగా ఉన్నదా? అతడు గోరంతలు కొండంతలుచేసి ఆ వాదాన్ని హాస్యాస్పదం చేయలేదా? 3. ప్లేటో భావవాదం అతడు పేర్కొన్న సాపేక్షతాపరిణామిత్వదోషాలను అతిక్రమిస్తున్నదా? ఈ భావవాదం ఎంతవరకు తర్కసిద్ధం? సామాన్యాలను అంగీకరించినంత మాత్రాన అతని భావవాదం సిద్ధిస్తున్నదా?

ఈ ప్రశ్నలను దృష్టిలో ఉంచుకొని ప్లేటో ప్రతిపాదించిన దర్శనార్థాల బాగోగులు పాఠకులే ఎవరికి వారు నిర్ణయించుకొంటారని ఆశిస్తున్నాను.

“తద్విజిజ్ఞాసస్వ”

# ప్లేటో రచనలు

Hippias Major
Hippias Minor
Ion
Menexenus
Charmides
Laches
Lysis
Cratylus
Euthydemus
Gorgias
Meno
Euthyphro
Apology
Crito

Phaedo
Symposium
Protagoras
Republic
Phaedrus
Theaetetus
Parmenides
Sophistes
Politicus
Philebus
Timaeus
Critias
Laws
Epinomis

# ఈ రచనకు ఉపకరించిన గ్రంథాలు


The Dialogues of Plato—Jowett, B.
Plato's Theory of Knowledge—Cornford, F. M.
Plato's Cosmology— ,,
Plato and Parmenides— ,,
The Republic— ,,
Plato's Examination of Pleasure—Hackforth, R.
Greek Political Theory—Barker, E.
Plato's Thought—Grube, G. M. A.
Plato's Theory of Ethics—Lodge, R. C.
Platon 2 vols—Ritter, C.
Essence of Plato's Philosophy—Ritter, C.
Plato: the Man and his Work—Taylor, A. E.
Platonism—Taylor, A. E
Plato— ,, ,,
History of European philosophy—Russel, B.
History of Political Thought—Sabine, G. H.
The Socialist Tradition—Gray, A.
History of Aesthetic—Bosanquet, B.

# GLOSSARY

అంగము part, organ

అంగాంగి భావము relation of the part and the whole

అంగి organic whole

అంతఃకరణ ప్రామాణ్యవాదము intuitional ethics

అంశము part

అఖండము that which has no part

అచేతనము that which is not animate

అతివ్యాప్తి too wide application

అతిలౌకికము supernatural

అతివాస్తవికవాదము sur-realism

అతీంద్రియము supersensuous

అద్వైతము non-dualism

అనంతము endless

అనంత శక్తిమత్త్వము having limitless power

అనవచ్ఛిన్నము indetermined

అనవచ్ఛేదము indeterminateness

అనవస్థ regressus in infinitum

అనుకరణము imitation

అనుకారి that which imitates

అనుకార్యము imitable

అనుకృతి act of imitation

అనుభవము experience

అనుమానము inference

అనువాదము translation, restatement

అనిర్వచనీయము indefinable

అన్యోన్యాశ్రితాలు mutually dependent

అపవర్గము release

అపౌరుషేయము the revealed
అభావము non-existence
అభిప్రాయము openion
అభివ్యక్తము manifested
అభివ్యక్తి manifestation, expression
అభివ్యజ్యమానము that which is being manifested
అభ్యాసము constant practice
అభ్యుదయము progress
అభ్యుదయకవి progressive writer
అమూర్తము infinite
అయథార్థము unreal
అరిస్టోక్రసీ aristocracy
అరిషడ్వర్గము six-fold passion
అర్థజ్ఞానము learning
అర్థము object, meaning, value
అలంకార శాస్త్రము aesthetics
అవచ్ఛిన్నము determined
అవచ్ఛేదము determinateness
అవచ్ఛేదకము determinant
అవయవము part, member of a syllogism organ
అవయవి organic whole, syllogism
అవిభాజ్యము indivisible
అవివేకము irrationality
అవ్యవస్థ crisis
అవ్యాప్తి too narrow application
అసత్ non-being
అసాపేక్షము non-relative
అసాపేక్షవాదము non-relativism

ఆకర్షణ attraction
ఆకారము form, shape
ఆచారము custom
ఆత్మ soul
ఆత్మసిద్ధి self-realisation
ఆదర్శము ideal
ఆదర్శరాజ్యము Plato's Republic, ideal state
ఆధ్యాత్మిక దృగ్వాదము, విజ్ఞానవాదము subjective idealism
ఆధ్యాత్మిక దృశ్యవాదము objective idealism
ఆధ్యాత్మికము spiritual
ఆనందము bliss
ఆనుషంగికము incidental
ఆభాసము appearance
ఆభ్యుదయికము progressive
ఆముష్మికము belonging to the other world
ఆలంకారికము relating to aesthetics
ఆవిర్భూతి genesis
ఆశ్రయము substratum
ఇంద్రియజన్య జ్ఞానము perceptible knowledge
ఇంద్రియము sense
ఇతివృత్తము theme, plot
ఉత్పత్తి production
ఉన్మాదము inspired
ఉద్బోధము inspiration
ఉద్యమము movement
ఉపదేశకము instructive
ఉపపత్తి proof
ఉపాధి hypothesis, limiting condition

ఏకతానత intuition

ఏకత్వము unity

ఏకత్వవాదము monism

ఏకత్వవాది monist

ఏకత్వ విశిష్ట బహుత్వవాదము monistic pluralism

ఏకదేశము part

ఏకదేశి whole

ఐంద్రియికము sensual

ఐంద్రియికశక్తి faculty of perception

ఐక్యము unity, self-identity

ఐహికము worldly

ఔచితి propriety

కర్ణము diagonal

కర్మ action

కళ art

కళాకారుడు artist

కళాసృష్టి work of art

కామము desire

కారణత causality

కారణము cause

కార్యము effect

కాలము time

కృతి work of art, effort

కేవలకళ pure art

క్రమము order

క్రమిక ప్రవర్ధమానత gradual progress

క్రీడ play

క్షీణత depletion

గణితశాస్త్రము mathematics

గతి motion

గతితార్కిక భౌతికవాదము dialectical materialism

గాంధర్వగానము pure music

గుణము quality merit

గోచరత perceptibility

గోళము sphere

గ్రహణము cognition

చతురస్రము square

చరిత్ర history

చరిత్రాత్మకములు historical

చితి knowledge

చిత్రణము presentation

చిత్రము picture, composite

చిత్రలేఖనము painting

చేతనము animate

జగత్తు universe

జడము inanimate

జనుశాస్త్రము science of genetics

జాగృతి wakefulness

జాగ్రదవస్థ state of wakefulness

జాడ్యము characteristic of the inanimate

జ్ఞాత knower, subject

జ్ఞానము knowledge

జ్ఞానస్వరూపము epistemology

జ్ఞేయము knowable

నటన mimicry

నాటకము a form of drama

నిత్యము eternal

నియంతృత్వము dictatorship

నిరుపాధికము non-hypothetical

నిర్లిప్తత detachedness

నిర్వచనము definition

నిష్పత్తి ratio, proportion

నీతి morality

నైపుణి skill

న్యాయము justice

పదార్థము category, matter

పదార్థ విజ్ఞానశాస్త్రము physics

పరంపరాగతము traditional

పరమము ultimate

పరమార్థము ultimate goal

పరమాణువు atom

పరామర్శము reflection, consideration

పరిణామము evolution

పరిణామి becoming

పరిపాలన administration

పారమార్థికము absolute

పారమ్యము absoluteness

పారలౌకికము relating to the spiritual world

పారలౌకికత్వము other-world-liness

[illegible]

[illegible]

[illegible]

పూరణము repletion

పౌరుడు citizen

ప్రకృతి nature

ప్రకృతిసిద్ధ సౌందర్యము natural beauty

ప్రచారము propaganda

ప్రజాస్వామికము democratic

ప్రజాస్వామ్యము democracy

ప్రతి copy

ప్రతిబింబము reflection

ప్రతిభ genius

ప్రతిభాసము illusion

ప్రతీతి knowledge

ప్రత్యక్షము perception, perceptual knowledge

ప్రత్యభిజ్ఞ recognition

ప్రభావము influence

ప్రభుత్వము government

ప్రమ valid knowledge

ప్రమాణము instrument of measurement, criterion

ప్రమాత One that measures, subject

ప్రమాతృకము subjective

ప్రమేయము object of valid knowledge

ప్రయోజనము utility

ప్రవృత్తి activity

ప్రాతిభాసికము illusory

బహుత్వవాదము pluralism

బాధ contradiction, pain

భక్తి participation, devotion

భావన imagination

భావము idea, form, existence, purport, concept.

భుజము side

భూతము element, physical substance

భౌతికము physicial

భౌతికవాదము materialism

భ్రమ error

భ్రమణము rotation

మనస్సు mind

మనోనిశ్చయము judgement

మనోవ్యాపారము activity of the mind

మాతాపుత్రికా భావం relation of the original and the copy

మారకము exchange

ముద్రాముద్రితభావము relation of the mould and the cast

మూర్తము finite

యథార్థము real

యదృచ్ఛ accident

యాథార్థ్యము reality

యాదృచ్ఛికము accidental

యుక్తి argument, reason

యోగజన్య జ్ఞానము mystic insight

రమణీయము beautiful

రాజ్యము state

రాజ్యాంగము constitution

రామణీయకము beauty

రూపకము drama

రూపము colour

రేఖాగణితము geometry

లక్షణము characteristic

వంచకము counterfeit

వక్తవ్యము expressible

వర్గకలహము class-conflict

వర్గము class

వస్తువు thing, content of a work of art

వాసన instinct

వాస్తవము fact, factual, real, actual

వాస్తవికతావాదము realism

వాస్తువు architecture

వికల్పన imagination, ideation

వికల్పనాశక్తి faculty of imagination or ideation

వికారము change, ugliness

వికృతి act of change, ugliness

విచారము enquiry

విజ్ఞానశాస్త్రము natural science

విప్లవము revolution

వివేకము rationality

విశిష్టము qualified

విశ్వాసనశక్తి faculty of faith

విషయము object

విస్తీర్ణత area

వృత్తి function, profession, existence, glossary

వృత్తికారులు artizans

వైవిధ్యము diversity

వ్యంజకము that which manifests or reveals

వ్యంజన function of manifestation

వ్యక్తము manifested

వ్యక్తి individual, particular manifestation

వ్యజ్యమానము which is being manifested
వ్యతిరేకి negative
వ్యత్యయము discrepancy, displacement
వ్యాపారము activity
వ్యాప్తి invariable concomitance
వ్యాయామము gymnastics
వ్యావహారికము phenominal
వ్యుత్పన్నత scholarship

శక్తి power, significance, faculty
శబ్దము sound, word
శరీరము body
శాస్త్రకారులు scientists, philosophers
శాస్త్రము science
శిక్షణము instruction
శ్రవణము faculty of hearing
శ్రవ్యత audibility
శ్రవ్యము audible
శ్రావ్యము musical

సంకల్పము will
సంఖ్య number
సంఘటన event, arrangement
సంబంధము relation
సంభావనీయత probability
సంవేదనము feeling
సంవేదము affliction
సంసారము mundane world
సంస్కారము tendency, reform, latent impression
సంస్కృతి culture

సంస్థ institution

సత్ being

సత్తా beingness

సత్తావాదము existentialism

సత్యము truth

సమన్వయము co-ordination

సమము uniform

సమాజము society

సమానత్వము equality

సమానాధికరణము co-existence

సమాహారము totality

సమీక్ష review

సమ్మిశ్రితము mixed

సమ్యగ్దర్శనము vision of truth

సరకు commodity

సరళరేఖ straight line

సహకారము co-operation

సాదృశ్యము likeness

సాధనము means

సాధర్మ్యము similarity

సాధారణము general

సాధారణీకృతి universality

సాధ్యము end

సాపేక్షము relative

సాపేక్షవాదము theory of relativity

సామరస్యము harmony

సామాన్యము general

సాహచర్యము concomitance, association

సిద్ధాంతము theory, established conclusion

సుఖము pleasure

సృజనము creativity

సృష్టి creation

సృష్టిక్రమము cosmology

సేవకసేవ్యభావము the relation of the servant and the master

సొంతఆస్తి private property

సోపాధికము hypothetical

స్పర్శవిషయము object of touch

స్మరణము reminiscence

స్మర్తవ్యము reminiscent

స్మృతి memory

స్వతంత్రసత్తా independent existence

స్వతంత్రసిద్ధాంత ప్రవర్తకులు propounders of independent theories

స్వయంగతికము self-mover

స్వయంభువు self-existent

స్వయమవచ్ఛిన్నత self-determinedness

స్వయంసంపూర్ణత self-sufficiency

స్వయంసంపూర్ణము self-sufficient

హేతువు reason

హ్రాసము devolution